## సదాశివ సమారంభాం



గురు దక్షిణామూర్తి



గురు వేదవ్యాస మహర్షి



గురు శుక మహర్షి



గురు నారద మహర్షి



గురు వాల్మీకి మహర్షి



గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం



గురు దత్తాత్రేయ



గురు బాబాజీ



గురు గౌతమ బుద్ధ



గురు ఆదిశంకరాచార్య



గురు రామానుజాచార్యులు



గురు జ్ఞానేశ్వర్



గురు రవిదాస్



గురు కబీర్ దాస్



గురు చైతన్య మహా ప్రభువు



గురు నానక్



గురు రాఘవేంద్ర స్వామి



గురు వీరబ్రహ్మేంద్ర స్వామి



యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం



గురు త్రైలింగ స్వామి



గురు లాహిరి మహాశయ





గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి



గురు వివేకానంద



గురు సాయి బాబా



గురు అరబిందో



గురు రమణ మహర్షి



గురు యోగానంద



గురు భక్తివేదాంత ప్రభుపాద



గురు మళయాళస్వామి



గురు విద్యాప్రకాశానందగిరి



గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014990

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# హితోపదేశకథలు.

## రెండవభాగము.



డి. యస్. రావుగారి కృతము.



పబ్లిషర్సు:

**వేంకటరామ్ అండ్ కో.,**

హెడ్డాఫీసు:—ఏలూరు.

రామా పవర్ ప్రెస్, ఏలూరు.

1930.

 [వెల ౦—౫.

# విషయసూచిక.



15. ఉత్తమజ్ఞాన సంపన్నుఁడైనవాఁడు, కులహీనుఁడైనను బూజనీయుఁడు. (ధర్మవ్యాధుఁడు)

16 చౌర్యము సేయఁగూడదు. (లిఖితుఁడు)

17. ఉపకారికి నపకారము సేయకుము. (గౌతముఁడను—బ్రాహ్మణుఁడు)

18. ఏకార్యము చేయవలసినను దీర్ఘాలోచనము సేయవలెను. (చిరకారి)

19. దుర్బలుఁడు ప్రబలునితోఁ బోరాడరాదు. (పవనుఁడు—శాల్మలీతరువు)

20. దైవారాధనమే మోక్షసాధనము. (గజేంద్రుఁడు)

21. శరణాగత రక్షణముకన్న సుకృతములేదు. (శ్యేనము—కపోతము)

22. రాజభక్తి గలిగి యుండుము. (వీరవరుఁడు)

23. విధికృతము నెవ్వరును తప్పింపఁ జాలరు (సుశీల)

24. అన్నదాన పరుండగు బ్రాహ్మణుఁడు (1)

25. డిటో (2)

# హితోపదేశకథలు.

రెండవభాగము.



చదివినను లౌకికజ్ఞానము లేనివానికిఁ బ్రమాదము వచ్చును.

## 1. గార్గ్యుఁడు.



గార్గ్యుఁడను నొక విప్రుఁడు ఘోరారణ్యమున దుర్గాదేవిం గూర్చి యతి నిష్ఠంబూని యొక సంవత్సరము తపంబొనర్చెను. జగదంబయగు నాదుర్గ యాబ్రాహ్మణుని తపంబునకు మెచ్చి ప్రత్యక్షమై "నీకుఁ గావలసిన వరము గోరుకొను" మని చెప్పెను. ఆబ్రాహ్మణుఁ డామెమాటల కపరిమితానందమును బొంది, యామె చరణములకు నమస్కరించి "తల్లీ! నిరంతరము భక్తులయందుఁ గృపఁబూని రక్షించుదాన వగుటంజేసి, నీకై తపం బొనర్చితిని. నీవును నాయెడలఁ గరుణ వహించి ప్రసన్నవై వరమడుగుమని చెప్పితివి. దేవీ! నీకు నాయందు సంపూర్ణకృప యున్నచో, నాకు సంజీవని నొసంగుము. ఇదియే నాయభీష్టము." అని పలికెను. అంత నాపరమేశ్వరి, తలఁచినమాత్రనే తన హస్తమునఁ జేరిన కొన్ని పచ్చని యాకులాగార్గ్యునకిచ్చి "బ్రాహ్మణోత్తమా! ఇదియే

సంజీవని. నీవీ యాకుల రసమును జిలికించితివేని శవములకుఁ బ్రాణములు గలిగి, ముందటి రూపమువచ్చి, తేజమును బలమును జెంది చరించుట కలుగును. ఈ యాకు లెప్పటికి నెండవు. తఱుగవు" అని చెప్పి యదృశ్యయయ్యెను.

ఇట్లు భగవతి యనుగ్రహమున సంజీవని వడసి గర్గ్యుఁడు నిజనివాసమునకు సంతోషముతో వచ్చుచుండెను. నిర్మనుష్యమగు నాకాంతారమార్గమున నొకచో నెండిపోయిన యొక పుండరీకశవంబు నాతఁడు చూచి, తనకు దేవి యనుగ్రహించిన సంజీవి శక్తిని బరీక్షింపఁదలఁచి, చేతనున్న యాకుల నలిపి, పసరును దానిపైఁ బిడిచెను. ఆపసరు మృతకళేబరముపైఁ బడిన యంతనే పుండరీకము సజీవమై నిద్రమేల్కొనిన పోలిక లేచి, భీకరపుఁ గేకలువెట్టుచు నాబ్రాహ్మణునిపైఁబడి చంపివేసి భక్షించెను.

బుద్ధిచాలని యభాగ్యులు మేలువడసినను తత్ఫలమును బొందఁజాలరు.

---

స్వల్పకార్యములకై యల్పులు పోట్లాడినను దమలోఁ దామె
సమాధాన పడవలెను.

## 2. శశకము - కపింజలము.



నర్మదాతీర పరిసరారణ్యమున నొక వృద్ధవ్యాఘ్రము తన హింసాకర్మమొరు లెఱుఁగకుండఁ గపట ధర్మబుద్ధినిఁ

చరించుచు వసించుచుండెను. ఆ వనంబున నున్న సత్త్వంబు లన్నియు దానిని నమ్మి, తమ్ముఁ బరిపాలించు చుండుమని వేఁడెను. అందులకుఁ జిత్రకాయము సంతసంబున సమ్మతించి "నేను మిమ్ములను హింసాకర్మంబున మాత్రము దండింపను. నాకు శక్తియున్నంతవఱకు న్యాయాన్యాయ విమర్శనంబొనరించి, తగువిధమున నరయుచుందు" నని చెప్పెను. మృగము లన్నియు నాటినుండి యా వ్యాఘ్రమును దమ కేలికగాఁ జేసికొనెను.

ఇట్లుండ నొక దినమున నొక శశకమును, కపింజలమును నెలవునకై పోరాడి, యిరువురును వ్యాఘ్రము కడ కరుదెంచి తమ వివాద కారణముఁ జెప్పి, దానిని దీర్పుమని వేఁడిరి. కపట బుద్ధిగల ఆ వ్యాఘ్రము వానింగాంచి "నేను పెద్దవాఁడనైతిని. పూర్వమువలెఁ జూపులేదు. దూరమున నుండి చెప్పినచో మాటకూడ విను శక్తిలేదు. కావున దగ్గఱకు వచ్చి మీ వివాదముఁ జెప్పుఁ" డని పలికెను. శశక కపింజలములు వ్యాఘ్రమును సమీపించి, తమ వివాద కారణము మరలఁ జెప్పిరి. అంతట నా చారలమెకంబా రెంటినిబట్టుకొని వధించి యాహారముగాఁ జేసికొనెను.

"సన్న కార్యములను ఘనములుగఁ జేసి, తగవుఁ దీర్చుటకు రాజులఁ జేరినచో నిరుతెగలవారికిని గీడు సంభవించును.

బలవంతుఁడును, పగవాఁడునగు దుష్టుఁడు స్నేహమునకు వచ్చి, నను గలుపుకొనరాదు.

## 3. సర్పము - మండూకములు.



"క. బలవంతుఁడుఁ బగవాఁడును
ఖలుఁడనఁగాఁ జాలువాఁడుఁ గపటోక్తులఁదాఁ
గలియఁగ వచ్చిన వెల్వడి
కలిపికొనిరయేనిఁ గీడు కాకుండదిలన్."

ఒక వేసవి కాలమున వింధ్యాచల పార్శ్వ కానన మంతయుఁ జండాతపముచే నెండిపోయెను. పసిమి యెచ్చటను లేక యరణ్యమంతయుఁ బాడయ్యెను. నేల యంతయుఁ బాతాళముదాకఁ బగిలెను. ఆకలి నీరు వట్టను చిచ్చునకుఁ దోడు కార్చిచ్చు మృగములను గాల్చఁదొడఁగెను. ఇట్టి కాలమున నాయరణ్యమున నొకచోటఁ బరిపూర్ణ జలభరితమైన నొక కూపంబున ననేక మండూకములు సుహృద్భ్రాతృ పుత్ర పౌత్రయుతములై, మహావేగుఁడను నొక మండూకమును రాజుగాఁ జేసికొని, సుఖముగా వసించుచుండెను.

ఇట్లుండఁ దనవారెల్లరును మరణింపఁ గంఠాశ్రయ జీవనమై తిరిగెడు భయదర్శకమను నొక సర్పము, మండూకనినాదము విని, "నీరుండనిచో నివి యుండవు కావున నిచ్చట

నీరుండఁగఁబోలు” నని యామండూకములున్న కూపమును సమీపించి, యందు భేకంబు లనేకంబు లుండుటఁజూచి సంత సించి, “నాపూర్వపుణ్యమున నీప్రదేశముఁ గంటిని. నాయా కలి దప్పులగంచుకొనుచు దుష్కాలదినంబు లిచ్చట సుఖ ముగాఁ గడిపెదఁగాక” యనితలంచెను. ఆ సర్పమునకు నూతి లోనికిఁబోవుటకు మార్గముఁ దెలియుక, యందుఁ బరిమిత పరి జనపరివృతుఁడైన దర్దురనాథుండగు మహావేగునిఁ గాంచి కపట భక్తి వినయవాక్యంబుల నిట్లు పలికెను. “ఓభేకకులనాథా! నన్నుఁ గరుణాదృష్టిని విలోకింపుము. దాహబాధ కతంబున నాప్రాణము నిలుచునట్లు లేదు. నిన్నుఁ గొల్చుట కిందు బ్రవేశింపఁ ద్రోవఁ గానకయున్నవాఁడ. నన్ను నీదరికిఁ జేర్చు కొని రక్షింపుము. మాపెద్దలెట్లుంగక మీపెద్దల కెగ్గు సల్పి యుండిరను మాట నీవు మఱచి నన్ను నీపాదసన్నిధికిఁ జేర్చు కొనుము. మండూకచక్రవర్తీ! నీవు పుట్టకపూర్వ మురగ సంఘములకుఁ గప్పలోడుట తటస్థించెనుగాని యిప్పుడు కాదు. హనుమంతునిఁ బ్లవంగమనియు, సింహుని హరియనియుఁ బిలు తురు. నిన్నును నాపేరులతోడనే పిలుతురు. వారితోఁ దుల్యుఁ డవగుటచేతనే నీవట్టి నామములకుఁ బాత్రుఁడవైతివి.”

ఈ వాక్యములకు మండూక నాథుఁడుప్పొంగి యా యహిని గాంచి “నామంత్రులయును మతంబున నిన్ను నాచో టికి రప్పింతును. అంతవఱకు నచ్చట నిలువు” మనిచెప్పి

తనమంత్రులఁ బిల్వఁబంచి, వారికా పాము రాకఁ జెప్పెను. మంత్రులు మహావేగునిఁ జూచి "పాముఁతో మనకేమి పొత్తు? ఇదియొక గొప్ప కార్యముగా నాలోచించెద వేల?" యని పలికిరి. కాని, కప్పలఱేనికి సర్పబాంధవము మానవలయు నను నభిప్రాయము లేదు. అందుచే స్వేతుండను దర్దురం బతని కిట్లు వచించెను. "ఒక్కొక్క సమయమున దుర్దినములు వచ్చినప్పుడు సకల భూచక్రమును బరిపాలించు చక్రవర్తి లజ్జ విడిచి చండాలుని కంటె నీచతఁ బొందును. ఒకప్పుడు నీచుఁడు తనుఁ బట్టపు రాజుగాఁ దలంచును. సుజనులగు వారికెప్పుడును చెలిమి శిలాక్షరముగను, నలుక జలాక్షరముగ నుండును. కుజనులగు వారికిఁ జెలిమి జలాక్షరముగను, నలుక శిలాక్షరముగ నుండును. కృష్ణరూపంబను మండూక మిట్లు చెప్పెను. దుష్టులెప్పుడును ఆత్మఘన రక్షాజాగరూకాత్మకులును, పరదోషేక్షణ దివ్య చక్షువులును, నన్యవిత్తహరణ ధ్యానక్రియా నైపుణులు నై యుందురు. కావునఁ జేరఁదగని దుర్జనుని జేర నిచ్చినచో సుజనులకుఁ గూడ హానిసంభవించుట నిశ్చయము. దుష్టమతియైన యీసర్పమునకు నీవుపకారము సేయనెంచితివి కాని పాత్రాపాత్రతల భావింపవైతివి. ప్రత్యక్ష క్రూరమైన సర్పముమాటల నీవు నమ్మవలదు. దీని సాంగత్యమున కీవొడంబడవలదు."

ఇట్లు హితముపదేశించి మంత్రులూరకుండిరి. నాటి యొద్దుననున్న సర్పము మరల భేకనాథునిఁ బొగడుచుఁ బలుక

నతఁడు మేనవాంగి, యాయురగమునకు నూతిలోనికిఁ జొచ్చి తెరవెతింగించెను. సర్పము నెమ్మదిగాఁ గూపంబును జొచ్చి మండూకపతిం జేరి, క్రమక్రమముగాఁ జిఱుకప్పల నెరగొనుచు సుఖముగా నుండెను. నానాటికి మండూక కులము తగ్గుచుం డుటఁ జూచి, వానిని సర్పమే భక్షించుచున్నదని యెఱింగి, భేకనాథుఁ డధిక చింతఁ బొందుచు బశ్చాత్తాప సంతప్తుఁడై భుజంగమునుఁ గనుంగొని "సర్పరాజా! మిత్రునివలె నుండి మా మండూక కులంబునెల్ల మడియించితివి. ఇయ్యది నీకు ధర్మమగునే" యని పలికెను. అందులకా యహి నవ్వుచు "మండూకరాజా! నీప్రధానులెల్లరును గడుఁ బాపకర్ములు-తొలుత నీకును నాకును సఖ్యము ఘటిల్లనీయక నీకుఁ బెక్కు దుర్బుద్ధులు గఱపిరి. వీరిని బ్రతుకనిచ్చినచో నీకును నాకును గల మైత్రిని హరింతురు" అని పలికి, తన్ను నూతిలోఁ బ్రవేశింప నీయవలదని చెప్పిన మండూకమంత్రుల నాక్షణము ననే చంపివైచి, కతిపయ దినములలోఁ దక్కిన మండూకముల నెల్లఁ దనపొట్టను బెట్టుకొనెను. ఇఁక నొకమండూక నాథుఁడు మాత్రమే మిగిలియుండెను. తుదకు తనవారెల్లరు నశింపఁగా నొంటిపడి భీతస్వాంతుఁడై విచారించుచున్న మండూకపతిం జేరి యా క్రూరసర్పము " నేను నూతిచెంతను జేరి దాహ మొందికూ పెట్టఁగా, నీవు గర్వమువహించి నన్ను సత్వరముగ నీకడకు రప్పింపవైతివి " యని పలికి, యాదర్దుర నాథుం గూడఁ జంపి వేసెను.

దుర్జనులతోఁగూడి సహవాసము సేయరాదు.

## 4. హంసలు - వాయసము.



"క॥ మతిస్మృతి లేని వెడంగుల
మతిగలిపిన సుమతికిం బ్ర ♦ మాదము వచ్చున్
మతిగలిపిన మతిమంతుఁడు
సితచ్ఛదోత్కరము చేతఁ ♦ జెడ్డవిధమునన్."

ఒక పర్వతము పైనున్న కొలనిలోఁ గొన్ని హంసలు పగలెల్లయథేచ్ఛను విహరించి, భానుఁడు గ్రుంకినయంతనే వేటకాండ్రకుఁ జేరఁ బోకరాని యున్నతోన్నతమగు నొక గండశిలయందుఁ జేరి రాత్రుల సుఖలీలఁగ వ్రాలుచుండును. ఇట్లుండుటం జేసి, యాహంసల నివాస మెఱిఁగియు వానిం బట్టుకొనుటకు వేటకానికి వశము గాకుండెను.

ఒకనాటి సంధ్యాసమయమున నొక కాకమా మరాళంబులను జేరవచ్చినఁ జూచి, యయ్యవి దానిని విలోకించి "వాయసమా ! నీవెచ్చటినుండి యెచ్చటికిఁ బోవుచుంటివి ? ఇచ్చట నేమి ప్రయోజనార్థము నిలిచితివి" యని యడిగెను. అందులకు వాయసము "ఆహారార్థ మచ్చటచ్చటఁ జరించి యునికిపట్టును జేరుటకుఁ బ్రొద్దు లేకపోవుటచే నిచ్చట నుండ వలసి వచ్చిన" దని బదులుచెప్పెను. మరాళగణమంతయు

నా కాకము నచ్చట నిలువుమని పలికిరి. కాని, యందు తెగ వెఱఁగిన మతిమంతుఁడను నొక యంచ తక్కిన యంచలను జూచి "ఎంగిల్లే యీ కాకమునకు భోజనము. దీని బుద్ధులా మిగుల క్రూరములు. ఇంతియేల? ఖగములందుఁ గాకమే చండాలుఁడను మాట మీరువినలేదా ! ఇయ్యది యీ రేయి మనకడ నిలిచినంతమాత్రముననే, నేడో రేపో గాక పోయినను, మనలకెప్పుడో కీడొందును" ని పలికెను. ఆ మాటలు విని కార్యంబెఱుంగని తరుణమరాళంబులు "దీనికింత వాదము గావలయునా ! ఈ కాకి యొక్కరాత్రి యిచ్చట నున్నంత మాత్రమున మనకుఁ గీడొదవునా ? పెక్కు బుద్ధులు గఱచిన వారికి భయమెక్కుడని చెప్పుదురు. ఇది యట్లుండనిమ్ము. అంధకారము జగంబు నావరించినది. ఇప్పుడు కాకమెక్కడికిఁ బోవును" అని మతిమంతునితోఁ బలికి, యా వాయసము నుండఁ బనిచి, యభీష్టములైన ఫలములతో భోజనమిడెను, ఆ కాకమా రాత్రి యచ్చట సుఖముగా నిద్రించి మఱునాడుదయమున నచ్చట రెట్టఁ బెట్టి యరిగెను. ఆ కాకము వేసిన రెట్టయందున్న వటభూజ ఫలములోని బీజమునుండి యొక మొక్క మొలిచెను. అది నానాటికి వృద్ధియై, బహుశాఖలఁ బేర్చి, యూడలుగూడ బెఱిగి వర్ధిల్లుచుండెను. ఈ వృక్షమును జూచి యానందమంది, కిరాతుఁడు దానియూడలసహాయమునఁ జెట్టుపైకిఁ బ్రాకి, హంసలఁ బట్టుటకు వలఁబన్ని వెడలి పోయెను.

భాస్కరుఁడపరాద్రిం జేరిన యంతనే మరాళము లన్నియు నచ్చటికిఁ జేరి, యురులందుఁ జిక్కుకొని తమ దురవస్థకుఁ జింతించుచుండఁగా మతిమంతుఁడు వానిం గాంచి మరాళములారా? నాఁడు నామాటల నిరాకరించి వాయసము నిచ్చోటఁ జేరనిచ్చుటయే మనకీ యాపద కలుగుటకుఁ గారణము. దాని రెట్టలో మొలిచిన యీ వటవృక్షముండుట చేతనేగదా బోయవాఁడు మనకై వలఁబన్నినాఁడు" అని పలికెను. అప్పు డంచ లామతిమంతునితో "మహాత్మా! నీమాటలు వినని కారణమున నిట్టి కీడిప్పుడు కలిగినది. దీనికై విచారించుచుఁగాలయాపనముఁ జేసినందువలనఁ బ్రయోజనము లేదు. ఏదియేని యుపాయ మూహించి మమ్ముల రక్షించి నిన్ను రక్షించుకొనుము. నీ పనిచినయట్లు మే మొనర్తు' మనిరి. మతిమంతుఁడు కొంచెము సేపు యోచించి యా హంసలకిట్లనెను. "పరస్పర వశ్యులగు బంధువు లాపదఁ గడవఁగలరు. ఇప్పుడైనను మీరు నా వాక్యములు వినుఁడు. మనకీ యురు లూడిచికొని పోవుటకు యుక్తి లేదు. కాని చావకుండ నుండు నుపాయము కలదు.

సూర్యోదయము గాకపూర్వమే వేటకాఁ డిచ్చటకు వచ్చును. వాఁడువచ్చి మనలఁ జూచునప్పటికి మనమందఱము నపగతప్రాణుల కరణినుందము. అతఁడు మనలను జచ్చినవిగా భావించి, చంపుటుడిగి, యురులఁ బాపి, వటము క్రింద దిగ

నైచును. వాఁడు చెట్టుదిగి వచ్చునప్పటికి మనమందఱము నెగిరిపోవుదము.”

మతిమంతుని వాక్యములకు మరాళము లన్నియు సమ్మతించి ఆమఱునాఁడుదయమున నవియన్నియు నట్లుండెను. వేటకాఁడువచ్చి చెట్టెక్కి, యీవిహగ యూథమున్న చంద మునఁగనుఁగొని, యురులచే నవి యన్నియు మెడలు బిగిసి చచ్చినవని సంతోషించి, వలనుండి యొక్కొక్కదాని నీవలకు దీసి చెట్టుక్రిందకు దిగవైచెను. మతిమంతుఁడు మాత్రము కడపటి శాఖయం దురియందుండెను. ఆతనిరాకఁ దలంప కుండఁ గ్రిందనున్న మరాళంబులన్నియు భీతిచే నెగిరిపోయెను. వేటకాఁడా విధముఁ జూచి పులుఁగులు తన్ను మోసపుచ్చెనవి తలంచి, యలిగి, యురియందున్న మతిమంతుని మెడ బిగ్గ నులిమి చంపెను.

---

ఐకమత్యమున్న ప్రజలెట్టి యాపదలనైన దాఁటుదురు.

## 5. కూర్మములు - గరుడుఁడు.



“క. తమలో నన్యోన్యవశ
త్వము గలిగినబంధులాప • దలనెల్ల నపా
యము మైఁబాతురు నిక్కము
కమఠంబులు గరుడబాధ • గడచిన భంగిన్.”

సముద్రతీరమున ననేక కూర్మంబులు వసించుచుండెను. గరుడుడు వానింబట్టుకొని యనుదినముఁ దన కాహారముగాఁ జేసికొను చుండెను. ఈ కారణమునఁ గూర్మముల సంఖ్య నానాటికిఁ దగ్గుచుండెను. ఆకూర్మములు తమకు గరుడబాధ యెట్లు తొలఁగునాయని విచారించుచుండ నొక కూర్మముఖ్యుఁడు దానికిఁ దగినయుపాయ మూహించెదనని వారికి ధైర్యముఁ జెప్పి, యా మఱునాడచ్చటికి ఖగేంద్రుఁడు వచ్చినఁజూచి, తాను నీటిలోనుండి యతనింగాంచి " పక్షిరాజా! మావారందఱును నీకాహారమైరి. నీకతంబున మాకు భరింపరాని దుఃఖము సంభవించినది. కావున నీవును నేనును నొక పన్నిదము వేసికొందము. ఇందులకు నీవు సమ్మతింతువా? " యనిపలికెను. ఆమాటలకు వినతాతనయుఁడు నవ్వుచు నాపన్నిదమేమో చెప్పుమనెను. కమఠము గరుడునిఁజూచి" నాపలుకుఁలకుఁజిత్తంబున నలుగక యవధరింపుము. ఆ కాశంబున నీవు బాఱునప్పుడు నేనుకూడ నంబోధిలోఁబాఱెదను. నేను నీకంటె ముందు బాఱఁగల్గితినేని, నిఁకనెన్నఁడును మమ్ము భక్షింపక యుండుము. నీకోడితినేని యిచ్చవచ్చిన యట్లుమాకులంబు నాహారముగాఁజేసికొనుము, ఇందు కొడంబడుదువేని యెల్లిసూర్యోదయమున నిటకు రమ్ము" అనెను. గరుడుఁడిందులకు సమ్మతించి యరిగెను.

తరువాత నాకూర్మముఖ్యుఁడు తనవారినెల్లరరావించి, తాను తార్క్ష్యునితో నొడఁబడి వచ్చిన చందంబెఱింగించిన

వారు సంతసించి " మనలోనిన్నుఁగడచిన మతిమంతులుగలరే! నీపనుపున మేమెట్టి కార్యమైనఁ జేయుదుము. చెప్పు " మని వచించెను. అంతటఁ గూర్మనాథుఁడు వారికి " మీరందఱును గొంచెము కొంచెము దూరముగా జలధియందు నిలిచి యుండుఁడు' ఆకసంబున ఖగస్వామి పఱచునప్పుడు, జలంబున నాతనికి ముందునుండు కూర్మముపైకిఁగనఁబడి ముందువచ్చి నట్లుపలుకవలెను." అని చెప్పెను. కూర్మములన్నియు నందులకు ముదమందుచు సమ్మతించి, యావిధమున సముద్రములో ననేక యోజనములుదాక నిలిచియుండెను.

ఆ మఱునాడుదయమున నచ్చటికి సుపర్ణుఁడు వచ్చెను. కూర్మముఖ్యుఁడును నతఁడును బఱచుటకుఁ దొడంగిరి. గరుడుఁడు కొంతదూరము పోయి, కూర్మము వెనుకఁబడియుండునని తలంచి, పిలిచినంతనే ముందున్న కూర్మము నీటినుండి లేచి "ఓ యని పలికెను. ఈ తెఱంగున పక్షినాథుఁ డెచ్చటఁ బిలిచిన నచ్చోటికిఁ గొంచెము ముందుగఁ గూర్మము "ఓ" యను పలుకు వినవచ్చుచుండెను. తుదకు గరుడుఁడు తన ఓటమికిఁ మిగుల లజ్జఁబొంది, యచ్చటనున్న కమఠంబును గాంచి "మీకిఁక నెన్నఁడు నెగ్గుసేయను. మీవారితో సుఖంబుగా నుండు" మని పలికి, వెడలిపోయెను.

దుష్టులు ప్రత్యుపకారము సేయలేక యుపకర్తలపై దోసమారోపింతురు.

## 6. జలపక్షులు - కాకులు.

క. "క్రూరులగు జనులు ప్రత్యుప
కారంబులు సేయఁజాల • కయ సుజనులపై
నారోపింతురు తప్పులు
కారండవ చయమువలనఁ • గాకులు వోలెన్."

కోసలదేశమున ధారాసనుఁడను రాజు గలఁడు. ఆతఁడధర్మపథంబునఁ జరించుచుండుటంజేసి, జనపదంబునఁ గఱవు సంభవించెను. అట్లగుటంజేసి, యా రాష్ట్రము తమ కాధారముగ నిలిచియున్న కాకితండం బెల్ల నొకయెడం గూడుకొని, "ఇండ్లముందెందు గింజలు మొదలగునవి యేమియుఁ గానఁబడవు. పూర్వమట్లెంగిలిమెతుకులు చల్లుటగూడఁ జూడఁబడదు. ఇఁక మనమిచ్చట నున్నందువలనఁ బ్రయోజనము లేదు. కావున మనము మఱియొక ప్రదేశమునకుఁబోయి కడుపులు రక్షించుకొందము" అని తలంచి, యా దేశమును విడిచిపోవుండెను. కాకులట్లు పోవుచుండఁగా మార్గమున నొక కాసారమునందున్న నీరుకాకులను పక్షులు పక్షిజాతిత్వమాత్రనిబద్ధంబగు బాంధవంబున, వానింజేరి ప్రార్థించి తమ నివాసమునకుఁ దోడ్కొని పోయి, మత్స్యముల నాహారంబుగాఁ బెట్టెను. వారి ఖగం

బులు పెట్టిన మీనంబులను భుజించి కాసారంబున నున్న విమలసలిలంబును గ్రోలి యాఁకలిఁ దీర్చుకొని, యాకాకు లారాత్రి యచ్చట సుఖనిద్రనొంది, వేకువనులేచి మఱియొక చోటికిఁ బోవఁ బ్రయాణమగుచుండఁ, గారండవములు వానిని "మీర లెచ్చోటి కెందులకుఁ బోవుచుండి"రని యడిగెను. అందులకుఁ గాకులు "మాదేశము కఱవునకు నిలయ మగుటచే నాహారముకొఱకుఁ బండిన భూములకుఁ బోవుచుంటి" మని బదులు చెప్పెను. జలపక్షులు వానిని దమయొద్ద నుండుఁడని యడిగెను. కాకు లామాటకు "ఈ సరోవరమున మీనంబులున్నవి. కాని, మేమీఁదలేని వారమగుటం జేసి యవి మాకు లభింపవు. ఇచ్చట మేము దరములనే వెరవునఁ బ్రోచికొందుము" అని పలుక, "మీ రందులకై సంశయింప వలదు. మేమే మీకు వారిచరోత్కరము నాహారముగాఁ బెట్టెదము. మఱియొక స్థలమునకుఁ బోవలదు. ఇచ్చట నిలువుఁడ"ని జలపక్షులు పలికెను. కాకు లందులకు సమ్మతించి యచ్చటనుండెను.

జలపక్షులు వాయసముల కనుదినంబును సరోవరమున నున్న మత్స్యములను నాహారముగాఁ బెట్టుచుండెను. వాయసములు వానిం దిని నానాటికిఁ గ్రొవ్వి, యీప్రదేశంబున నిచ్ఛాలీల విహరించుచుండెను. ఇట్లనేక దినంబులు గడచెను. కాకులు తాము విడిచివచ్చిన ప్రదేశము సుభిక్షముగా నుండెనని

తెలిసి, యచ్చటికిఁ బోవఁదలఁచి, యవి యన్నియు నొక యెడఁ గూడి "ఈ కారండవములు మన కుపకారము చేసినవి. వీనిఁగన్నమొఱఁగి పోనేరక యున్నచో మనకుఁ బ్రత్యుపకారము సేయు శక్తిలేదు. వీరికిఁ జెప్పకుండఁబోయినచోఁ జోరత్వము వచ్చును. చెప్పిపోయినచో వీరికిమఱొకప్పుడైనఁబ్రత్యుపకారము సేయవలయును. కావున వీరు మనకుఁ జేసిన యుపకార మప్పగఁగైకొని యేలపోవలయును ? వీరిపై నేదో యొక దోషమారోపించి పోవుదము, అని యాలోచించి యాజలఖగంబులను జేరి "జలపక్షులారా ! మేము చిరజీవులము. మాయిచ్చవచ్చిన చోటికిఁబోవక మీరాపుటచే నిచ్చట నిలిచి పరాభవింపఁ బడితిమి. కిల్బిషవర్తనులగు మీరు మాకెంగిలిఁ బెట్టితిరి. కాలగతిని నోడలు బండ్లును, బండ్లోడలు నగునను సంగతి మీరరయలేక పోయితిరి. కానిండు. మీ భోగములు మీకే యుండుగాత" యని పలికి "కాకా" యని యఱచుచుఁ బూర్వప్రదేశమునకుఁ జనెను.

---

తులువల కాపద మూడినను సహాయము చేయ రాదు.

## 7. పక్షి - శార్దూలము.

"క. తులువకు నాపద మూడినఁ
జెలిమిమెఱుఁగువాఁడు చక్కఁ ♦ జేయుటయెల్లం
బులికినొక మ్రానిపోటుం
బులుఁగుపకారంబు సేయు ♦ పోల్కి యగుఁదుదిన్."

తొల్లి యొక కాంతారమున నొక శార్దూలమొక మృగంబును వధించి, దాని మాంసమును భక్షించుచుండఁ, గోళ్ల సందియందొక యెముక గ్రుచ్చుకొనెను. దినక్రమమున నాపులికా కారణమున బాధహెచ్చి యాననగహ్వరమంతయు వాచి భుక్తిఁగొనఁజాలక రేయింబవళ్ళు గట్టిగా వాపోవుచుండెను. అచ్చట నొక వృక్షముపైనున్న ద్రుమకుట్టవిహంగ మాపులింగాంచి దాని బాధకుఁ గారణమేమని యడిగెను. చిత్రకాయము తాను పొందిన వేధ దానికిందెలిపెను.

ఆ బాధను తొలఁగించెదనని మ్రానిపోటు పులుఁగు జెప్పెను. చిత్రకాయ మందులకు సంతసించి "నాకీబాధఁ బాపితివేని నీకు నేనెప్పుడును నాప్తసఖుఁడనై యుండి, నేను తెచ్చుకొనుచుండు నాహారమును నీకుఁ గూడఁ దప్పక యిచ్చుచుందు" నని పలికెను. అంతటనాపక్షి శార్దూలమును వదనమును దెఱువమని నియమించి, తాను సాహసంబున నందుఁ జొచ్చి, గోళ్ల సంధియున్న యెముకను సంచున నూది పట్టి, పెఱికి, యధిక వేగమున నీవలకువచ్చి ద్రుమశాఖనెక్కి, యెముకను నుమిసెను. పులికి బాధ తగ్గి క్రమ క్రమముగా నాహారముఁ దినుటకు శక్తి కలిగెను.

ఇట్లుండ నొకనాడా శార్దూల మొక మృగంబును వధించి తన నెలవునకుఁ దీసికొని వచ్చి తినఁదలంచు చుండ, నచ్చటికి ద్రుమకుట్టమువచ్చి తన భుక్తికిఁ దగిన మాంసము

బెట్టుమని శార్దూలము నడిగెను. అందులకు శార్దూలమా పక్షిం గాంచి "నీవెవ్వరవు? నీకు మాంసమేల పెట్టవలయును. పులుఁగు వగు నీకును నాకును సంబంధమేమి యున్నది?" యనిపలికెను. ఆమాటలకుఁ బక్షి "నీవు నన్నెఱుంగవా? ఇంతలోనె మఱచి పోయితివా? నీవడిన ఆహారంబును జొచ్చి దౌడల యందు నాటిన శల్యమును జెఱికి నీకు సుఖము గూర్చిన చెలికాడను గానా?" యనెను. అందులకు వ్యాఘ్రము నవ్వుచు దానితో నిట్లనెను. "కాయలుడివోయిన భూజమును, పాడిగడచిన ధేనువును, నేఱు దాటించిన వాఁడును, గార్యముఁదీర్చిన యతిఁడును అప్పుడేగాని తరువాత నాదరణీయులు గారు. అనేక సత్వఘాతుకుఁడనై విపినంబునఁ జరించుచుండు నావదనంబున నీవు జొచ్చినప్పుడు కుపితుఁడనై నిన్నుమ్రింగకుండ విడచుటయే మహోపకారమని తలంపుము. ఇంతకంటెఁ గావలసిన దేమున్నది? పొమ్ము?"

వ్యాఘ్రము పలికిన పలుకుల కేమియుఁ బ్రత్యుత్తర మీయక యప్పటికా విహంగ మచ్చోటు వాసిపోయెను. కాని, తన యెడల నట్టి నిరాదరణముఁ జూపిన చిత్రకాయమున కెటు హానిఁగూర్తునా యని యాలోచించుచుండెను. ఇట్లుండ నొకనాఁడా వ్యాఘ్రము నిద్రించుచుండఁగా భ్రమకుట్టము నెమ్మదిగా సమీపించి దానికన్నుఁబోఁ బొడిచి, చయ్యన భూజాగ్రము నెక్కి హాస్యప్రౌఢ వాక్యములతో

" శార్దూలపతీ! పోయిన కంటికి వగవకుము. రెండవ కన్నున్నందులకు సంతసింపుము" అని పలికెను. ఇట్లు నయనము నొవ్వి బాధ భరింపఁజాలక యాపులి కొన్నాళ్ళకు మరణించెను.

---

అతిదాతృత్వము మంచిదికాదు.

# 8. కొక్కెర.



"క. వ్యవసాయము కొలఁదియు, దే
శవిధముఁ గాలంబుఁ బూర్వసంచితమగు సొ
మ్మును విచారింపక యిబ్బున
దివిరి వ్యయముసేయునతఁడు దీనతఁజెందున్."

ఒకదేశ జలములేని యొక్క మడుఁగుచెంత నొక చిన్న కొక్కెర వసించుచు, నందుండు జలచరముల నాహారముగాఁ జేసికొని సుఖముగాఁ గాలము గడపుచుండెను. ఇట్లుండ నొకనాడంబరవీధినిఁ బెక్కు బకంబులు పోవుచుండుటఁ జూచి, తనకులమువారని సంతసించి, వానికడ్డముగాఁ బోయి, తాను నివసించు నెలవుఁజూపి " మీరందఱును నచ్చోటికి రావలయును. అచ్చట నొక్క కొలనుగలదు. అందు బ్రశస్తములగు మత్స్యములున్నవి. కులమువారగు మీకు మెచ్చు విందుఁ జేసెద" నని ప్రియవాక్యంబులఁ బలికెను. ఈ వాక్యములు విబుద్ధిమంతంబులగు నావిహంగములు బకంబునుఁ జూచి

కులమువారిపై నీకున్న భక్తికెంతయు సంతసించితిమి. నీవు మమ్మాపవలదు. వాత్సల్యముండినఁ జాలును. మమ్ముఁ బోనిమ్ము అని పలికెను. బకంబందులకు సమ్మతింపక వానిని మఱింత బ్రతిమాలఁగా, నందుఁగొన్ని విహంగములు దానిం జూచి "బకమా! ఈ యూథమనంతము. నీనెలవు మేముం డుటకుఁ జాలదు. నీవు చెప్పిన తటాకమును నందుండు నాహారమును మేమెఱుంగుదుము. అవి యల్పమాత్రములు జలదాగమము వఱకును నీకు సరిపోవును. మాకొఱకు నీవు శ్రమ పడవలదు. మమ్ముఁ బోనిమ్ము" అని పలికెను. అందులకు బకము "మీరు నావాక్యములు ద్రోచిపోయినచో మీరెల్లరుఁ గనుచుండ నిప్పుడే జీవములు విడిచెద" నని వచింప, నా పక్షులామాటలు ద్రోసివేయఁ జాలక, దాని నివాసమున కేగెను.

ఆరాత్రి యాపక్షు లచ్చటనిలిచి, తటాకంబున నున్న మత్స్యములనెల్ల, మందుకైన నొక్కటి లేకుండఁ దిని మఱునాఁడుదయమునఁ బోయెను. తరువాత కొక్కెరకు దినుటకొక మత్స్యమైన లభింపక, యాకలిబాధచేఁ గొన్ని ప్రొద్దులకు మడిసెను.

అనుచిత లోభగుణ ముండఁగూడదు.

# 9. ధనగుప్తుఁడు - వర్ధమానుఁడు

"క. చెలితనమునఁ దనుఁజెఱచిన
తులువంగని తొలఁగిపోక • తోరపుఁ బ్రియముల్
పలుకుల తీపులుఁ జూపుచుఁ
జెలియై వర్తించిగాక • చెఱుపఁగ నగునే."

ధరారమణికి భూషణంబయిన యుజ్జయినీ నగరంబున ధనగుప్తుఁడు, వర్ధమానుఁడు నను నిరువురు సఖులుండిరి. సర్వ ధన ప్రపూర్ణులైన వారిరువురును వణిక్కులంబులో మిగుల ఖ్యాతిఁగాంచిరి. చీనా దేశమున నొక ద్వీపమందు ఇనుము నకు సమముగా బంగారమిచ్చెదరని విని యారువురును రెండోడలపై నినుము వేసికొని యాదీవికిఁ బోవుటకు సముద్ర ముపైఁ బ్రయాణమైరి. మార్గమధ్యమున వర్ధమానుఁడు జ్వర పీడితుండగుటచే ధనగుప్తుఁడతనింగాంచి "మిత్రమా! నీ విప్పుడు సముద్రప్రయాణము సేయఁజాలవు. గృహంబునకుఁ మరలిపొమ్ము. నీయినుమునకు వచ్చు సువర్ణమును నేను తెచ్చి యిచ్చెదను. నావిషయమై నీవావంతయు సందియ మందఁ బనిలేదు." అని పలికెను. ధనగుప్తునిమాటలు నమ్మి వర్ధమానుఁడు నిజపురమునకుఁ బోయెను. ధనగుప్తుఁడు వర్ధ

మానుని సేవకులతోడను, నోడలతోడను, ద్వీపమునుజేరి యచ్చటఁ దాఁదెచ్చిన యినుమును విక్రయించి, దానికి సమమగు హేమమును నోడలపై జేర్చి, మరల సముద్రముపై నిజ పురాభిముఖుం డయ్యెను.

ఇట్లు వచ్చునప్పుడా ధనగుప్తుడు తన మనంబున వర్ధమానునకు నోడడు హేమము నిచ్చుటకు నాచిత్తము సమ్మతించుటలేదు. ఈ సొమ్ములో నతనికి వీసమైన నీయ జాలను. ఎక్కడిచుట్టము! ఎక్కడి మిత్రుఁడు!'' అని తలంచి, వర్ధమానుని సేవకులను నీటిలోఁ ద్రోచిచంపి, యోడలనొక రేవునకుఁ జేర్చి, యచ్చట నొకప్రదేశమున యా యోడల యందున్న హేమమంతయు, బాఁతి, యాత్మని వాసముఁ జేరెను. అతఁడు వచ్చినజాడ నెఱింగి వర్ధమానుఁడతనిం జేరి కుశలప్రశ్న ములడిగి "అన్నా! నీవు మార్గమధ్యమున నేమి కష్టములు బొందుచుంటివో యని తలంచుచు, నిన్ను సుఖముగా నింటికిఁ జేర్పుమని భగవంతుని వేడికొనుచు నీరాకకై వేచియుంటిని. సుఖముగా వచ్చితివిగదా! ఎట్లులాభము వడసితివి!" యని యడిగెను.

అందులకు ధనగుప్తుఁడు దుఃఖము నటించుచు "స్నేహితుఁడా! ఏమని చెప్పుదును. సముద్రమును దాటి యినుమును విక్రయించఁదలంచిన పురంబునఁ జేరి, యందొక్క గృహంబున నాయినుమును జేర్చి యుండఁగ, మూఁడు రాత్రులలోఁ దాని

సంతతియు నౌకలు భ్రమింగినవి. కొండంత యినుములో నొక పాటికమైనను నుండనీయక యవి తినివేసినవి. ఇఁక నే నచ్చట నుండుటకు మిగులసిగ్గుపడి విచారమనస్కుఁడనై యుదధి గడచి వచ్చితిని. నీపరిచారకులు తెవుళ్లచే మడసిరి. మిత్రుఁడనైన నేను నిన్నుఁ జెరచితిని. పాపపు దైవము మనకట్టి చింత గలిగించినాఁడు, అని పలికెను.

ఈమాటలు విని వర్ధమానుఁడేమియు బదులు చెప్పక గృహంబునకు వచ్చి యంతరంగమున "ఈధనగుప్తుఁడు నన్ను సంపూర్తిగ వంచించినాఁడు. ఇప్పుడు నే నేమియుఁ దొందరపడ రాదు, చెలికీనమున నన్ను వంచించిన యీతనిని నేనుమరలఁ జెలికీనముననే వంచింప వలయును" అని తలంచి, యెప్పటి నెయ్యంబు నటించుచు, నాతని గృహమునకుఁ బోవుచు వచ్చుచుండి యొకనాఁడు కమఁబ్రేమ గలిగిన వానివలె నాతని పుత్రుని నెత్తుకొని తనగృహంబునకుఁ దోడితెచ్చి, యొకచోట దాచి, దుఃఖసముద్రమున మునింగిన వానివలె నుండెను. కొంతసేపటికి ధనగుప్తుని సేవకుఁడువచ్చి తన యజమానుని కొడుకు నిమ్మనియడిగెను.

అందులకు వర్ధమానుఁడు మిగుల వగచుచు "అక్కటా! ఈమాటఁ జెప్పుటకు నాకు నోరు రాకయున్నది. ఆకుమారుని నొక గ్రద్ద యెత్తుకొనిపోయిన" దని పలికెను. సేవకుఁ డరిగి యామాట ధనగుప్తునితోఁ జెప్పెను. ధనగుప్తుఁ డా పలుకు

విని కడు నాగ్రహంబంది, "లోకములో నిట్టి వింతయుండునా" యని తనవారితోఁ బలికి, వెంటనే రాజదగ్గఱకుఁ బోయి, యీసంగతి నెఱింగించెను. రాజేంద్రుఁడు వర్ధమానుని రప్పించి "నీవు ధర్మపరుఁడవు. ధనవంతుఁడవు. ఏ యుగంబుననైన బాలకుని గ్రద్దయెత్తుక పోయెననుమాట వింటిమా? నీవిట్లు బొంకవచ్చునా" యని పలికెను. అప్పుడు వర్ధమానుఁడు ముకుళితకరకమలుఁడై రాజుతో "మహారాజా! ఈ విషయమును మీరు బాగుగ విమర్శింపవలయును. రెండోడల యినుమును మూషికంబులు దినుట యెక్కడనైనఁ గలదా! ఇట్లియ్యనని చెప్పుచు నాకితఁ డీయవలసిన నావెడు ధనంబు నీయకయుండె" నని వచించెను. ఆ వృత్తాంతమేమని జనపతి ధనగుప్తునడుగ నతండిట్లుపలికెను. "ఈతఁడు నాకు హితుఁడు. ఈతనికై నేను వ్యాపారమునకు రెండోడల యినుమును దీసి కొనిపోయితిని. ఆయినుమంతయు నెలుకతండము భక్షించెను. ఓడెఁడినుమునకును నోడెఁడు కనకము రావలయునని ఈతఁడు పలుకుచున్నాఁడు."

వర్ధమానుఁడు రాజుంగాంచి 'నృపాలా! ఇనుమును నెలుకలు భక్షించెనుట కల్లపలుకు గాకున్నచో నొక బాలుని గృధ్రమెత్తుకొని పోయెననుమాట యనుచితమగునా" యనెను. ఆమాటలకు రాజునవ్వి మంత్రులనుగాంచి "ధనగుప్తుఁడు బొంకిన దానికి వర్ధమానుని మాట సరిపోయిన" దని

పలికి, ధనగుప్తునిఁజూచి "ఓయీ! నీవు కల్లలుపలికితివి. ఎలుక తెచ్చుటన్నైన నియమము గలదా? ఈతని ధనంబీతని కిమ్మ" ని చెప్పెను. వర్ధమానుఁ డిచ్చిన యినుమున కినుమే గాని కనకమెట్లిచ్చెద "నని ధనగుప్తుఁడు పలుకఁగా, నృపాలుఁ డాగ్రహమునంది, భటులంజూచి "ఈ వైశ్యుఁడసత్యవాది. మిత్రద్రోహి వర్ధమానుని ధనంబపహరించి యిట్లు ప్రేలుచున్నాడు. వీనింజావమోదుఁడు, అని నుడివెను. అంతట రాజభటులా ధనగుప్తుని బట్టుకొని, నంతనే యతఁడు దేహము వడంక; రాజుతోఁ దనకు నినుమునకుఁ బసిడి యిమ్మడి గల్గుటయును, తాను రెండోడల కనకమును దెచ్చి వర్ధమానుని సేవకులను నీట ద్రోచి చంపుటయుఁ దాను సువర్ణము పాతిన చోటును జెప్పెను. అంతట రాజేంద్రుఁడు తనవారిం బంపి, ధనగుప్తుఁడు పాతిన రెండోడల కనకంబును దెప్పించి వర్ధమానున కీయఁగా వర్ధమానుఁడు "దేవా! నాధనము నాకున్నఁజాలు" ననిపలికి యోడెఁడుకనకము మాత్రము పుచ్చుకొనెను. వర్ధమానుని గుణమునకు సంతసించి, రాజేంద్రుఁడు ధనగుప్తుని సర్వధనంబును గైకొని, యాతనినాలుబిడ్డలతోఁ బురంబు వెడల నడపెను.

---

వివేకములేనివారితోఁ బొత్తుకలిపికొని
సదుపదేశముఁ జేయరాదు.

# 10. వానరము - పక్షి.

ఒక వృక్షరాజముపై నొక పక్షి తనభార్యతో వసించు చుండెను. ఆపక్షికి చెలికాఁడై యొక వానరముఁ గూడ నా చెట్టుపైననే యుండెను. ఒక నాటిరాత్రి దట్టమైన వర్షము గురియుచు, నరణ్యమంతయు జలమయంబై యొప్పెను. అప్పుడు పక్షి—కొన్ని మిడుఁగురు పుర్వులను మన్ననకంటఁ జేసి గూటిలోఁ బెట్టి—తానును భార్యయునందుండి, యొకవృక్ష శాఖపైఁ జలిచే వడఁకుచున్న తన సఖుఁడగు వానరమును జూచి యిట్లుపలికెను. "మిత్రుఁడా! చలిచేమిగుల బాధఁ బొందు చున్నావు. ఈ వానయెప్పటికడఁగునో! ఎప్పుడు తెల్లవారునో! నా గూడుకడుసన్న మగుటచే నీకిందెడములేదు. నీకు నేనేమియు నుపకారము సేయఁజాలక యున్నాను.

"ఉ. మచ్చికరెట్టిగాఁగ దన ♦ మందిరమొంది యభీష్టవస్తువుల్
నెచ్చెలులెల్లఁ బొంది సుఖ ♦ లీలఁజరింపఁగఁ జేయలేమికిఁ
వెచ్చనియూర్పు నించికొని♦ విన్నఁదనంబును బొందినెవ్వఁగ
న్వచ్చినయట్లు సజ్జనుఁడు ♦ వేతొకదుర్దశచేత నొచ్చునే.

తనవారు బాధనొందుచుండఁగాఁ జూచి సుజనుఁడైన వాఁడోర్వలేఁడు. వానరోత్తమా! ఉండుటకుఁ దగిన యాలయ

మును నీవు జేసికొని యుండకపోవుటచే నిట్టి కష్టము సంభ వించినది."

ఇట్లు విచారించుచు హితముఁ జెప్పిన పక్షిమాటలు విని వెంగలియైన యాఁకోతి తన మనంబున "ఈ పక్షి తన భార్యతో సుఖముగాఁ గూటిలోనుండి నన్ను సహాయునిగాఁ దలంచి, యిట్లు ప్రేలుచుండెను. తన కిల్లున్నదఁట! నాకు లేదట! దీని గర్వమడంచెదఁ గాక" యని తలంచి, పక్షి గూడున్న తరుశాఖను పెళ్ళున విఱిచి, వెఱపుచే ఖగాంగన గూయుచుండ నీటిలోఁ బడవైచెను. అప్పుడు నీళ్ళంబడి బెగడు చున్న తన భార్యను రక్షించుకొని, యాపక్షి మఱియొక చోటికిఁ బోయెను.

వివేకహీనులతోడ చెలిమి యెవ్వటికైనను నాపద కలిగించును.

---

సుమతి పగమేలు విమతి నెయ్యమున కంటె.

# 11. బ్రాహ్మణుఁడు - చోరుఁడు.

ఒకపురంబున బంధుకుండనెడు బ్రాహ్మణుఁడు గలఁడు. తొల్లి యాతఁడు ధనికుఁడై యుండి, యవిలంఘ్య దైవఘటనచే దారిద్ర్యసాగరంబున మునింగెను. బిడ్డలు కడుపునిండ నాహా రము లేక దీనులై యుండుటఁ జూచి, భార్య చింతించుచుండ,

నాతఁడామెను విలోకించి "నీవు విచారించినందువలనఁ బ్రయోజనము లేదు. బ్రహ్మవ్రాతను నెవ్వఁడును దప్పింపఁ జాలఁడు. అయినను నీదారిద్ర్యమునుండి మనము తొలంగు నుపాయ మూహించెదఁగాక! చిత్రవర్ణ నగరంబున నా తమ్ముఁడగు విపులుఁడు ధనవంతుఁడై యున్నవాఁడు. నేనాతనికడ కేగి నాదురవస్థఁ దెలిపినచో నేమైని యొసంగకపోవఁడు, అని పలికి యొక దినంబున బయలుదేరి, దినదిన ప్రయాణంబులఁ జిత్రవర్ణ నగరంబుఁ జేరెను. విపులుండగ్రజుని జూచినంతనే మహాభక్తితో నమస్కరించి, తగువిధంబున గౌరవించి, కుశల ప్రశ్నంబులడిగి, యాతని దైన్యస్థితియంతయు నెఱింగెను. విపులుఁడు నిజపుత్రకళత్ర సహితంబుగా, నారాధించుచుండ బంధుకుఁడచ్చట నొక మాసముండెను. ఒకనాడు బంధుకుఁడు తమ్మునిఁజూచి "తమ్ముఁడా! నేనువచ్చి మాసమైనది. గృహమున నాలుబిడ్డలు బెంగపడి యుందురు. నేనెట్లయిన నెల్లిపయనము గావలయు" నని చెప్పెను. విపులుండందులకు సమ్మతించెను.

ఆనాటి యర్ధరాత్రి సమయమున విపులుఁడు బంధుకునిఁ దన గృహావరణంబున నున్న రసాలభూజముక్రిందికిఁ దీసికొనిపోయి, "అగ్రజా! నీవు నాకుఁ బితృసముఁడవు. నీకుపకారము సేయుటకన్న నాకు మఱియొకపుణ్యము లేదు. నీకు నేను ధనంబిచ్చితినేని దారియందు దొంగలవలన మిగుల భయం బొందవును. కావున ననేక నిష్కసహస్రమూల్యంబగు

నొక్క మాణిక్యమిచ్చెదను. దీనిని నీవు మ్రింగి యుంచుకొని జీర్ణమలినాంబరముల ధరించి వేశువజామున నరుగుము" అని చెప్పి యొకమాణిక్యము మ్రింగనిచ్చెను. తరువాత నయ్యిరువురును శయన స్థానంబుల కరిగిరి.

ఆయిరువురి పలుకులును, దద్వ్యాపారంబులును, నా భూజముపై దాఁగియున్న యొక చోరుఁ డెఱింగి సంతోషించి యంతరంగమున "ఈ విప్రులుని యింటికిఁ గన్నము వెట్టి పోయితినేని యేమి దొరకునో! ఇప్పుడు నాకు మంచి లాభము కలిగినది. నేను నెమ్మదిగా నావిప్రుఁడు బయలుదేఱు నప్పుడు వెంటనేగి, మార్గమధ్యమున నాతని వధించి, మణిఁ గైకొని, యిఁకఁ గన్నపువేఁట మాని సుఖముగాఁ జరించెద" నని తలంచి యొకచోట నుండెను. ప్రభాతకాలమున బంధుకుఁడు పయనమై పోవుచుండెను. చోరుఁడాతని పజ్జఁ దగిలి సాధువోలె సముచితంపు భాషలాడుచు, దాను తలఁచిన పనికి ననువుఁ జూచుకొనుచుఁ బోవుచుండెను. ముందున్న యరణ్యమున నావిప్రుం డెగటాస్పవచ్చుననుకొని యాచోరుఁడు కొంతదూరమరిగెను. అంతలో నాప్రదేశమునకు మఱి కొందఱుచోరులువచ్చి, యాచోరుని, బ్రాహ్మణునిఁబట్టుకొని కట్టికొట్టఁగా, వారు "అయ్యో! మేమునిరుపేదలము. మమ్ము బాధింపవలదు. రక్షింపుఁ" డని మొరవెట్టిరి. వారి మొరవిని చోరులు కొంచెము కృపగలిగిన చిత్తముఁ గలవారై "మీరు కపట వేషముల ధరించినారు. ఈమాయలుమనకుఁ దెలియవని

తలంచిరి కాఁబోలు! వీరి యుదరములఁ బట్టి చీరుదము. ముందుగా నొక్కని కట్లుగావించి వాని యుదరమున నేమైన నున్న రెండవవానింకూడఁ జీరుదము. లేకున్న వానిని విడిచి పెట్టుదము." అని తలంచి, ముందొకని వధించుట కుద్యుక్తులయిరి. అప్పుడు బ్రాహ్మణునిఁ దొలుత మోసము జేయఁ దలంచిన చోరుఁడాత్మగతంబున "తానొకటి తలఁచిన దైవమింకొకటి సేయునను పలుకు తథ్యమయ్యెను. పాపుఁడైన బ్రాహ్మణునిఁ జంపఁదలంచి నందులకు నాకీ ముప్పుఘటిల్లినది. ఇప్పుడీ తెక్కలికాడు బ్రాహ్మణుని కడుపుఁ జీల్చి యందున్న రత్నములజూచి, పిదప నన్నుఁగూడఁ జంపుదురు. అట్లుగాక ముందు నా కడుపే చీల్చి, కనకము లేకుండుటఁ జూచి, యీ బ్రాహ్మణుని విడిచి పెట్టెదరు. నేనెట్లయినను జచ్చుట నిశ్చయము. కావున నెట్లయిన బ్రాహ్మణుని రక్షించి యాతనిం జంపఁదలఁచిన పాపమును బోఁగొట్టుకొందునని తలంచి, యాచోరులతో ముందు తనకడుపు చీల్చుఁడని పలికెను. అంతట వారు ముందుగా నాచోరుని యుదరముఁ జీల్చి యందుఁ గనకమును గానక, బ్రాహ్మణుని జంపినను నిట్లేయుండును. ఏమిప్రయోజన" మని, యాబంధుకుని బంధవిముక్తునిఁ జేసి విడిచి పెట్టిరి. క్రూరులచే విడిచిపెట్టఁబడిన బ్రాహ్మణుఁడు నిజ నివాసము జేరికొనినను నను జూఁడిచ్చిన రత్నములతో ధనికుఁడై దారా సుతాదులతో సుఖముగా నుండెను. వివేకమానస చోరుఁడైన చోరుఁడు భగవదనుగ్రహమున నాకమున కరిగెను.

మోసముఁ జేసియైనను శత్రువుల సంహరింప వచ్చును.

## 12. సర్పము - మూషికము.



"క. నమ్మకపోరాదను తతి
నమ్మి రిపునిఁ గలిసి నమ్మ ♦ నడచుట యొప్పం
బిమ్మట నేమఱక తొలఁగి
నమ్మక యుండంగవలయు ♦ నరవర వానిన్."

ఒకఁ డొక క్రూర సర్పంబును బట్టి, వెదురు పెట్టియం బెట్టి, దానికెరగా నొక మూషికంబును బడవేసెను. ఆయురగ మా మూషికంబును గఱవరాఁగా, నయ్యది బెదరక దానిం గాంచి "నీకు నే నుపకారముఁ జేసెద. నీవు నన్ను రక్షింపుము. నాతో నీవు చెలిమిఁ జేసితి వేని మన యిరువురకును మేలు కలుగును. నేనీ పెట్టియం దెప్పుడు పెట్టబడితినో యప్పుడే చచ్చినదానిగఁ దలఁచితిని. సగము చచ్చియున్న నన్నుఁ జంపినను, నీకుఁ జెఱ తప్పదు. అధిక బలుఁడనగు నాచేత గాని దీ మెలుక చేతనగునా యని నీవు సంశయింపవలదు. ఎవ్వఁడే కార్యమున నిపుణుఁడో వాఁడు దానియందుఁ బూజ్యుఁడు. వానిని హీనుఁ డనవలదు. సూదివలన నగుపని గొడ్డలిచేతఁ గాదుకదా!

"క. తన కార్యము కొఱకై హీ
నుని యొద్దకునైన బోఁజ ♦ నుఘహింజండా

లుని యింటి కుపశ్రుతికై
చనునఁగా స్వార్థమాది ♦ సద్విజుఁడై నన్"

నేఁజెప్పినట్లు నీవు నిందు వేని నీకీ చెఱతప్పును. ఇందులకు నీవు సమ్మతింపక నన్నుఁ జంపితి వేని నీయాఁకలితీరునా? నిన్ను నేనుచెఱఁ బాపితినేని, నీ యిచ్చవచ్చినట్లు క్రీడించుచుఁ జిఱుకప్పలను, బలులను, నెలుఁకలను హాయిగా భక్షింప వచ్చును" అనివలికెను.

ఈ మాటలకు సర్పము సంతసించి యమ్మెలుకను కరండనిగ్రహ మెట్లుడిపెదవని యడిగెను. అందులకు మూషి కము సర్పమును జూచి "నేను నీతలపై నిలిచి యొకమంత్రము జపించెదను. జపము పూర్తి యైనంతనే నిన్నుఁ బిలిచెదను. నేను పిలుచునంతవఱకును నీవు కన్నులు మూసికొని యుండ వలయు" నని పలికెను. ఎలుక చెప్పినట్లు సర్పము కన్నులు మూసికొనెను. ఎలుక దాని శిరముపై నిలిచి కరండనిగ్రహ మునర్చి యామార్గమునఁ బోయెను. కొంతసేపటికిఁ బాము కన్నులు తెఱచి చూచి, "ఆహా! మూషికము నన్ను మోసము చేసి ప్రాణముల రక్షించుకొని యావలఁ బడినది. లేకున్నచో సుఖముగా భక్షించి యుందునే" యని తలంచుచు ఎలుక చేసిన మార్గమునుండి యావలకుఁ బోయెను. దురాత్ములకు ధర్మబుద్ధి యుండదుకదా!

అట్లు కరండమునుండి వెలువడిన యురగము మూషిక ముందు బిలద్వార మెఱింగి, యిచ్చటికిఁ జేరి "నాప్రాణ సఖుఁడా! ఈవలకు రమ్ము. నీతో నుచితసల్లాపములు సేయ వలయు" నని పలికెను. ఆపలుకులు విని మూషికము మృద్బద్ధంబైన బిలద్వారంబున నిలిచి, యాశీవిషముతో "సర్పమా! నన్ను నీవు రక్షించితివి. నిన్ను నేను రక్షించితిని. ఈ విషయము మఱవక యుండుము. అదియేచాలును. హీన బలుఁడనగు నేను నీచెలిమి కెంతవాఁడ. ఇది యట్లుండ, నేను నీకువైరిని. కార్యార్థమాత్ర మిత్రత్వమున నన్ను నీవు సహింపుదువా? ఇన్నిమాటలేల! నేను నిన్నుఁ జేరుటకు వెఱతును. అని పలికెను. ఆమాటల కహి సిగ్గుపడి యరిగెను. మూషికము సుఖముగానుండెను.

---

మతిమంతు లుపాయము చేతనే శత్రువుల నడంతురు.

## 13. బోయవాఁడు - శుకము.



"గీ. అసపావజాతియఖిలంబుపైఁ బాఱుఁ
బసిఁడిమీఁద నేల పాఱకుండు
పసిఁడిమీఁద నాస పాఱిన మనుజుండు
తనకువచ్చుకీడు తలఁపఁ గలఁడె."

ఒక యరణ్యంబున నొక మహోన్నత భూజంబుపైఁ దన పిల్లలతో నొక శుకియుండెను. చిలుక పిల్లలను నొక

బోయవాఁడప్పుడప్పుడు తీసికొని పోవుచుండుట గలదు. ఒక నాఁడువాఁడాపిల్లలకొఱకై యాభూజము నెక్కి, గూటియందున్న పిల్లలను దీయుచుండఁగా, శుకి వానిని విలోకించి " అన్నా! కన్నులు తెఱవని నాపక్షుల వలన నీకేమి లాభమున్నది. ఇవి నీ కాహారమున కక్కఱకు వచ్చునా? పిల్లలను జంప వచ్చునా ? " అని పలికెను. అందులకాబోయ " నేను నీపిల్లలను జంపుటకుఁ దీసికొని పోవుటలేదు. నేను వీని నెవ్వరికైనను వెలకమ్మెదను. వారు వీనిని గారాబముతోఁ బెంచుదురు." అని బదులుచెప్పెను. అప్పుడు కీరాంగన వానికిట్లు పలికెను. "నీవు ధనముపైఁ గాంక్షచేతనే యిట్లు చేయుచుంటినని పలికితివి కావున నీకుఁగనకమున్న ప్రదేశము జూపెదను. నా బిడ్డల విడువుము. ఒక భాగ్యవంతుఁడు దొంగల బాధకు భీతిల్లి యిచ్చటకు సమీపమున నున్న యొక వెలగ మ్రాని తొఱ్ఱయందు సువర్ణమును దాఁచినాఁడు. నేనది చూచినాను. ఆ ధనమును జూచితి నేని నీవు మరలఁ బక్షులను బట్టు బుద్ధిఁ బూనవు. నేను నీ కాతావుఁ జూపెద."

కీరము పలుకుల కాతఁడు సంతసించి భూజమును దిగెను. అంతట నా శుకమాతనిని దన నివాసమునకుఁ గొంచెము దూరముగానున్న యొక వెలగ చెట్టుం జూపిపి దాని తొఱ్ఱయందే ధనమున్న దని చెప్పెను. ఆ తొఱ్ఱలిలో మహాభయంకరమైన యొక సర్పముండుట యెఱింగి, దానిచే

నాతఁడు హతుండగునని తలంచి యాశుక మాతని నాప్రదేశ మునకుఁ గొనివచ్చెను. బోయివాఁడు చిలుకమాటలనమ్మి, యీ వెలగమాని తొలటయుంచుఁ జేయువెట్టిన యంతనే యందుండి, భీషణోరగంబీవలకు వచ్చి కఱచెను. వెంటనే యాతఁడు నేలఁబడి మృతినందెను.

"క. తనచే నసాధ్యుఁడగు శ
త్రుని నన్యునిచేతనైనఁ ♦ ద్రుంగునటులుగా
నొనరింపవలయుఁ దానెఱుఁ
గనివాఁడును బోలెనీతి ♦ కౌశలమెసఁగన్."

దురాశ దుఃఖముఁ దెచ్చును.

## 14. సువర్ణష్ఠీవి.



పర్వత నారదులను మునులు సృంజయుండను రాజు కడ కొకసమయమున నేగి, యాతనిచేఁ బూజింపఁబడి, తన్మందిర మునఁ గొన్నాళ్ళుండిరి. ఆ రాజేంద్రుఁడొనర్చుచున్న సేవలకు వారు సంతసించి యతనిం గాంచి "రాజేంద్రా! నీకు గావలసిన వరంబేదేని యొకటి గోరుకొను" మని పలికిరి. ఆపలుకులకు సృంజయుఁడు సంతసించి "మహాత్ములారా! దేవతలను మించునట్టి యొక కుమారుఁడు నాకుదయించునట్లును, నాతని నిష్ఠీవనాదులు సువర్ణమగునట్లుగను నాకు వరంబనుగ్రహింపుఁ"

డని కోరెను. మునీంద్రులా వరమును రాజేంద్రునకుఁ బ్రసా
దించి నిజేచ్ఛంజనిరి.

కొన్నాళ్ళకు సృంజయునకొక కుమారుఁడు జన్మించెను.
వాని నిష్ఠీవన మలమూత్రాశ్రుస్వేదనంబులు సువర్ణమయము
లగుచుండుటచే నాతఁడు సువర్ణష్ఠీవియను పేరంబఱఁగి, దినదిన
ప్రవర్ధమానుఁడగుచుండెను. చోరులీ వృత్తాంతమునెఱింగి సమ
యము వేచియుండి, యక్కుమారు నడవి కెత్తుకొని పోయి
వధించి, యుదరంబున సువర్ణంబుఁగానక మృతకళేబరమును
బాఱవైచి పోయిరి. మందిరంబునఁ గుమారునిఁ గానక
సృంజయుఁడు పరిపరి విధములఁ బరితపించుచు, నాతని నెవ్వరు
ముచ్చిలించిరో యరయుటకు నలుదిక్కులకు భటుల నంపెను.
అరణ్యమునఁ జోరులచేఁ జంపఁబడిన సువర్ణష్ఠీవికళేబరమును
జూచి వచ్చి, యావృత్తాంతము సృంజయున కెఱింగించిరి.
సువర్ణముపై భ్రాంతిచే నెవ్వరో క్రూరు లాకుమారునకు
మృతిఁ గూర్చి యుందురని రాజేంద్రుఁడు శోకించుచు
నారదునిఁ దలంచుకొనెను. నారదుం డరుదెంచి, మృతినొందిన
సువర్ణష్ఠీవిని బ్రతికించి, రాజునకు మోదముఁ గూర్చి
యరిగెను. మఱికొన్నాళ్ళకు సృంజయుఁడు, భార్యాపుత్రులతో
భాగీరథీ తీరకాంతారమునందు విహరించుచుండఁగా, నొక
శార్దూలమువచ్చి, సువర్ణష్ఠీవిని నోటఁ గఱచుకొని యదృశ్య
యయ్యెను. అప్పుడు రాజేంద్రుఁడును, భార్యయు మిగుల

విలపించి మరలనారదుని దలంచుకొనిరి. నారదుండుడరుదెంచి శోక సముద్రమున మునింగియున్న నృపాలునిఁ జూచి "రాజేంద్రా! ఇఁక నీవు విచారించినందువలనఁ బ్రయోజనము లేదు. నీకును నీకుమారునకును ఋణముతీరినది. దేహికి జననమరణములు సహజములు. నీకుమారుఁడు తన్నుమించునే మోయని యింద్రుఁడే యిట్లు జేసినాఁడు" అని చెప్పివెడలెను. దురాశఁబూని యిట్టి కుమారుని గాంచినందులకీదుఃఖము కలిగినదని రాజేంద్రుఁడూరటఁ బొందెను.

---

ఉత్తమజ్ఞాన సంపన్నుఁడైనవాఁడు, కులహీనుఁడైనను బూజనీయుఁడు.

## 15. ధర్మవ్యాధుఁడు.



చతుర్వేదంబులును, సమస్త శాస్త్రములును, సంపూర్తిగాఁ జదివిన ధర్మవ్యాధుండను నొక బ్రాహ్మణుడు గలఁడు. ఆతనికొక రాజపుత్రుఁడు సఖుఁడై యుండెను. మిత్రత్వమునఁ జేసి యా తఁడా రాజపుత్రునితో ధనుర్విద్యాభ్యాసముఁ జేసి యరణ్యమునకరిగి పెక్కు మృగంబుల నేయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు, విధివశమున ధర్మవ్యాధుఁడు విడిచిన శరము తపముఁ జేసికొనుచున్న మునికిందాకినంతనే యతఁడు నేలఁ బడెను. ధర్మవ్యాధుఁడు మిగుల భయమందుచు మునిని

సమీపించి, యనునయవాక్యములఁ బలికెను. కాని యమ్మునీంద్రుఁడలిగి "నీవు బ్రాహ్మణుఁడవై యుండియుఁ బాపకర్మమునఁ బ్రవేశించితివి కావున మృగవ్యాధ జన్ముండవగుదువు గాక" యని శపించి, వెండియుఁ గరుణించి "నీవు కిరాతకులంబున జన్మించినను సమస్తధర్మములు నీయందు నిలిచియుండును. గురుపూజ సేయుదువు. అపరజన్మంబున బ్రాహ్మణుండవగుదువు" అని పలికెను. ధర్మవ్యాధుఁడు మునిశాపమునఁ గిరాతుఁడై మృగమాంసమును విక్రయించుకొని జీవించుచుఁ గురుశుశ్రూషలఁ గావించుచుండెను.

ఇట్లుండఁ గౌశికుండను నొక బ్రాహ్మణుఁడు ధర్మ తపశ్శీలుఁడును, సంతతాధ్యయన తత్పరుండునై యొక శిష్ట గ్రామమున నుండెను. అతఁ డొకనాఁడు గ్రామసమీపమున నున్న యొక వృక్షమూలమున నాసీనుఁడై వేదంబులు చదువుచుండఁ దదీయశాఖాగతంబైన యొక కొక్కెర యాతనిపై రెట్టవైచెను. అంతఁ గాద్విజుం డలిగి చూచినంతటనె యాబకము నిశ్చేతనమై నేలంబడెను. అంతట నాబ్రాహ్మణుఁడు తన మూలమున నాకొక్కెర మృతినొందెనని మిగుల విచారమంది మధ్యాహ్నమగుటం జేసి, కృతాహ్నిక క్రియావిధానుండై గ్రామంబున కరిగి, యందు శుచులైన విప్రగృహంబుల కరిగి భిక్షాచరణంబు సేయుచు, నందొక్క వాకిట నిలిచి "భిక్షాం దేహి" యనినంతటనే, నాయింటి సతియు నతి సంభ్ర

మమున భిక్షయిడుటకు రాఁబోవ నాక్షణముననే యామె పతి మిక్కుటముగు నాఁకలితో గృహమునకు రాఁగ, నతనికిభోజనం బిడి తగు సపర్యల జరపి, యంతలో వాకిట నిలిచియున్న కౌశికునిఁదలంచి, భిక్షఁగైకొని యాతని కియ్యఁబోయెను. కౌశికుఁడు రోషరంజితలోచనుఁడై "ఓపడఁతీ! ఇంతకాలము నిలిపియుంచి నన్నవమానించుట నీకు ధర్మమా?" యనెను. అంగుల కా పతివ్రతాతిలకము పతి సపర్యల యందుండుటచే నాలస్యమయ్యెనని పలికెను. బ్రాహ్మణుఁడు గినిసి యామె కిట్లనెను.

"ఉ. నీమగఁడింత యెక్కువెమ ♦ నీషులు భూసురులంతతక్కువే
కోమలి యేలయిట్లుకడుఁ ♦ బ్రొవ్వనఁగానవులోకవంద్యులన్
భూమిసురేంద్రులన్ దవిజ ♦ పుంగవుఁడాదిగభక్తిఁగొల్చుచో
నేమిటికొక్కవారుగడు ♦ నెల్లిదమైరిట నీకు నిచ్చటన్."

"క. అవమానితులై ధరణీ
దవిజులు రోషాగ్ని శిఖల ♦ దీపించి మహో
ద్రివన ద్వీపంబులతో
నవనినయినఁ బొడవడంతు ♦ ర(ప)తికారుల్."

బ్రాహ్మణుని క్రోధవాక్యముల కాసాధ్వీ శిరోమణి యిట్లు ప్రత్యుత్తరమిచ్చెను. "బ్రాహ్మణోత్తమా! నా తెఱంగు సెప్పెద నాకర్ణింపుము. నాకుఁ బతియే పరము దైవము. వాఙ్మనఃక్రియ లందాతని కనుగుణ్యముగ నడచుకొనుచుందును.

నీవతి క్రోధుండవగుట నేనెఱుంగుదును. నీకోపంబున నొక కొక్కెర నిహతంబయ్యెఁ గాదె. ఇది మదీయ పాతివ్రత్య మహిమంబునఁ జేసి కాంచితి. క్రోధంబుఁ గొనియాడుట లగ్గుకాను. ధర్మము బహుమార్గ దృష్టంబై సూక్ష్మంబై యుండును. నీవు కేవలము స్వాధ్యాయ పరుండవు గాని ధర్మసూక్ష్మము నెఱుంగవు. కావునఁ దడయక మిథిలానగరంబున కరుగుము. అందుఁ జితేంద్రియుఁడును, సత్యవాదియు, మాతాపితృభక్తుఁడును నైన ధర్మవ్యాధుండను కిరాతుఁడున్నవాఁడు. ఆతఁడు నీ కఖిల ధర్మంబుల నెఱింగించి, సంశయచ్ఛేదంబు సేయును."

ఇట్లు పలికిన యాసాధ్వి వచనముల కచ్చెరువుఁబొంది, యాబ్రాహ్మణుఁడామెకు నమస్కరించి సెలవుఁబొంది ధర్మవ్యాధ దర్శన లాలసుండై పయనంబై యనేక నగర గ్రామంబులతిక్రమించిచని మిథిలానగరంబు సొచ్చి, రాజమార్గంబు దఱిసి, జనంబులచే ధర్మవ్యాధుఁడున్న తావెఱింగి, యయ్యెడ కేగి ముందట మృగమాంస ఖండంబు లంగడింబఱచి యమ్ముచున్న యక్కిరాతుంగని, యతిజుగుప్సితంబైనసూనాఘణంబు సేరనొల్లక తొలంగి యొక్కయెడ నుండు నంతన, నా ధర్మవ్యాధుఁడు బ్రాహ్మణుని రాకంగాంచి, యాతని కడకువచ్చి పరమభక్తితో మ్రొక్కి కుశలంబడిగి, బ్రాహ్మణపతివ్రతయొక్క యుపదేశమున నాతఁడువచ్చిన సంగతి నెఱింగించెను. కౌశికుఁడు ధర్మవ్యాధుని యొఱుక కచ్చెరునొంది,

తదీయ భవనంబున కరిగి, యాతనిచేఁబూజితుఁడై యహింసే త్యాది ధర్మంబులఁగూర్చి యుపదేశమునంది, యాతనికి నమస్కరించి తన నెలవున కరిగెను. ధర్మవ్యాధుఁడు నిజధర్మ వ్రతానుచరుఁడై కొన్నాళ్లకు దేహమువిడిచి, యపరజన్మంబున బ్రాహ్మణుఁడై విరాజిల్లెను.

"తే. హింస సేయనివాఁడులేఁ • డిజ్జగమున
నొక్కఁడైనను దమతమ • యోపినట్లు
హింస తెరువునకడ గల్గి • యేగవలయు
నదియు చూవె యహింసనా • నతిశయిల్లు.

"అ. పాప వర్తనుండు • బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రు కంటె • నీచతముఁడు
సత్యశౌచ ధర్మ • శాలి శూద్రుండయ్యు
నతఁడు సద్ద్విజుండ • యనిరి మునులు."

---

చౌర్యము సేయఁగూడదు.

## 16. లిఖితుఁడు.

"తే. కల్లు ద్రావుట గురుపత్ని • గవయుటయును
విప్రుఁజంపుట బ్రహ్మస్వ • విషయమైన
ముచ్చిలుటయును నివిగల • క్రూరజనులఁ
బ్రీతిఁ బొందుటయును మహా • పాతకములు."

సమస్తశాస్త్రంబులును జదివినవారును, నిరంతరము భగవద్భక్తిఁ బూని చరించువారును, సదాచార సంపన్నులు నగు శంఖలిఖితులను నిరువురు బ్రాహ్మణసోదరులు బాహుదా నదీతీరమున నాశ్రమములు గల్పించుకొని వసించుచుండిరి. ఒకనాఁడు శంఖుఁ డాశ్రమంబున లేని సమయమున, లిఖితుఁడు సమీపవనంబున కరిగి, యొకవృక్షమున నున్న పండ్లను గోసి తినెను. అగ్రజుఁ డాశ్రమమునకు వచ్చి, ఫలంబు లెక్కడివని తమ్ముని నడుగ నాతఁడు సత్యము బలికెను. శంఖుఁడు తమ్మునిఁ జూచి అనుమతి లేకుండ సెవాకులతోఁటయందుండు భూజమునఁ బండ్లు గోసితివి. ఇయ్యది చౌర్యం బనఁబడును. మఱియుఁ బాపము సంభవించును. కావున నీవు కడుశీఘ్రముగ రాజసన్నిధికేఁబోయి నీనేరముఁ జెప్పుకొని, దండించుమని వేడికొనుము.'' అని పలికిన నందులకు సంతసించి యాలిఖితుఁడు రయంబున బయలుదేఱి, నృపాలుని మందిరముఁ జేరి ద్వారముకడ నిలిచియుండెను. ద్వారపాలకు లాతని రాకఁ గాంచి, రాజేంద్రునకు విన్నవింప నాతఁడు రయమున లిఖితునకెదురువచ్చి నమస్కరించి, తోడ్కొనిపోయి దివ్యపీఠంబున నాసీనుం జేసి వినయపూర్వకముగా నిట్లు పలికెను. "తపోధనాగ్రగణ్యా! మీ రరుదెంచుటం జేసి నామందిరము మిగుల పావనత వహించినది. నేను కృతార్థుఁడ నైతిని. మీతపంబులు నిర్విఘ్నముగ సాగుచున్నవా? మీరిచ్చటి కరుదెంచిన కార్యమేమి? అయ్యది యెట్టిదైనను జేసెద.''

అందులకు లిఖితుఁడు రాజుంగాంచి రాజేంద్రా! నేను మీయాశ్రమ సమీపమున నున్న యొకరి వనములో ఫలంబులఁ గోసితిని. కావునఁ దస్కరుని విధంబున నన్ను శిక్షించి వికత పాపుని జేయుము. రాజుచే దండింపఁ బడినవారిని యముఁడు దండింపఁడని యార్యులు వక్కాణింతురు. నన్ను రక్షించినందువలన నీకుఁ గీర్తివచ్చుచుండు" అనిపలికెను. ఆమాటలువిని భూకాంతుఁడు విస్మయమంది, లిఖితుంజూచి "బ్రాహ్మణోత్తమా! నన్నీకార్యమున నియోగించుట తగదని యనేక ప్రకారంబులఁజెప్పెను. కాని, యాబ్రాహ్మణుఁడు వినకుండుటంజేసి, యారాజోత్తముఁడు లిఖితుని కరములఖండించెను. లిఖితుఁడు నృపాలునిననేక విధంబుల నాశీర్వదించి యాశ్రమంబునకుఁబోయి, ఖండింపఁ బడిన హస్తములను నగ్రజుఁడగు శంఖునకుఁజూపెను.

శంఖుఁడు తమ్మునిఁజూచి "తమ్ముఁడా! నీమూలమునఁ గులమునకు గౌరవము వచ్చినది. ఇఁక నీవు బాహుదానదీ పుణ్యతోయములందుఁ గృతస్నాతుఁడవగుము. కల్లుద్రావుట, గురుపత్నిని గవయుట, బ్రాహ్మణునిఁ జంపుట, ముచ్చిలుట మొదలగునవి మహాపాతకములని చెప్పఁబడెను. ఈపాతకములలో నేదియొనర్చినను నేకులజుఁడైనను దండనార్హుఁడే, రాజుచే దండింపఁ బడిన వాఁడు పాతకంబులవాసి, సుకృతవంతుఁడై యుండు" నని పలికెను. అగ్రజుని యాజ్ఞననుసరించి

లిఖితుఁడు బాహుదానది యందు స్నాన మొనర్చెను. ఆతఁడు స్నాన మొనరించిన యంతనే, ఖండింపఁ బడిన హస్తములు మరలఁ బ్రభవించెను. అందులకు లిఖితుఁడు విస్మయ మందుచు నన్నకడకరుదెంచి హస్తములను జూపఁగా నాతఁడిట్లుపలికెను. అనుజా! దీనికినీవద్భుతమందఁ బనిలేదు. ఇయ్యదిదైవకృపచే నాతపో మహిమంబున నైన విశేషము. నీవింక శుచివైతివి. నిన్ను దండించిన రాజేంద్రుఁడును ధన్యుఁడయ్యెను."

---

ఉపకారికి నపకారము సేయకుము.

# 17. గౌతముఁడు-బ్రాహ్మణుఁడు.



పూర్వము గౌతముఁడను నొక బ్రాహ్మణుఁడు స్వకులాచార ధర్మములు విడిచి బోయదానిని భార్యగాఁ జేసికొని యనుదినంబును గిరాతులఁగూడి వేఁటకుఁబోవుచు, మాంసముఁ దినుచు భోగాసక్త చిత్తుఁడై కాలము గడుపుచుండెను. ఇట్లుండి ధనంబు నార్జించుటకుఁగొందఱు వైశ్యులతో స్నేహముఁ జేసికొని, వారువర్తకమున కై దేశాంతరముఁబోవుచుండ, నాభూసురుఁడుఁ గూడఁ జనెను. వారందఱును బోవుచు నొక మహారణ్యమును బ్రవేశింప, నొక్క మహాగజంబు వర్తక సంఘముపై గవియ, నెల్లరును భయమంది నల్దిక్కులకుఁబాఱి పోయిరి.

వర్తకులతో నరిగిన భూసురుం డొక మార్గమునుబట్టి పోయిపోయి యొక వటవృక్షమును గాంచి, సేదఁదీర్చుకొనుటకు దాని క్రింద నాసీనుఁడై యుండెను. అప్పుడచ్చోటికి నాడీజంఘుఁడు, రాజధర్ముఁడునను నామంబుల నొప్పు నొక బకము వచ్చి యా బ్రాహ్మణుని విలోకించి "భూసురోత్తమా! నీవెచ్చటికేఁబోవుచు నిచ్చటకరుదెంచినాఁడవు? నిన్ను జూచినంతనే నా స్వాంతమున సంతసము జనించినది. నీవు నాయింటి కతిథివైతి" వని పలికెను. అందులకా భూసురుఁడు కొక్కెరంజూచి యిట్లుపలికెను. "నేను గౌతముఁ డను బ్రాహ్మణుఁడ. ధర్మశాస్త్రములఁ జదువక, కులధర్మములఁ బరిత్యజించి, బోయెతను నాలిగాఁ జేసికొని, ధనార్జనాసక్త చిత్తమున వర్తకుల వెంటవచ్చుచుండ, నరణ్యమున నొకగజము మాపైఁ గవిసెను. అందఱును భయంబంది నలుదెసలఁ బరుగిడిరి. నేనిట్లువచ్చితి" బకమాతని పలుకులు విని, "నీవు విచారముడుగుము నీదారిద్ర్యము నేను బాపెద. నాయొనర్చు నాతిథ్యము స్వీకరింపు" మని పలికి, మందాకినీ నదియందుఁ దాను దెచ్చిన మత్స్యములు పక్వముజేసి, వన్యఫలంబులతో నాహారమిడి సంతృప్తునిఁ జేసెను. ఆ రాత్రి భూసురుఁడు బకము నిర్మించిన పర్ణశయ్యను గాలముగడిపెను. మరునాఁడుదయమున నాకొక్కెర భూసురుని విలోకించి ఇట్లుపలికెను. "స్నేహితుఁడును, గనకమును, రజతమును, బుద్ధియు, నీనాలుగును దారిద్ర్యము

వాపుటకుఁ గారణములని మున్ను శుక్రుఁడు చెప్పియున్నాఁడు. ఈ నాల్గింటియందును, మిత్రుఁడెక్కుడై తనరుచుండును. నేను నీకు నేటినుండి మిత్రుఁడనై మెలఁగుచుందును. ఇచ్చట కనతిదూరమున మధుద్రవజనునుపురం బొందుగలదు. దానిని బరిపాలించు విరూపాక్షుండను దానవుఁడు నాకు హితుఁడై యున్నవాఁడు. నీవు తిన్నఁగా నాతనికడకరిగి నేను పంపితినని చెప్పుము. అతఁడు నీకుఁ గావలసిన ధనంబొసంగు" నని చెప్పెను.

గౌతముఁడు నాడీజంఘుఁడు చెప్పిన తెరువు ననుసరించి మధుద్రవజమునకేగి విరూపాక్షునిజూచి "నేను నీహితుండగు రాజధర్మఁడు పంపఁగావచ్చిన భూసురుఁడను. నా దారిద్ర్య బాధ నీవపనయింపఁగలవని యాతఁడు నన్ను నీకడకంపెను." అనిపలికెను. రాక్షసేంద్రుఁడు గౌతమునిజూచి "నీవేకులమున జన్మించితివి? నీవృత్తియేమి? ఎట్టిపనులనభ్యసించితి"వని యడిగెను. బ్రాహ్మణుఁడు తన సంగతి నొక్కింతయు దాఁచక యెఱింగించెను. దానవుఁడాతని వృత్తాంతమెఱింగి, యెట్టివాఁడైనను రాజధర్మనకు సఖుండగుటం జేసి సహాయము సేయఁదలంచి, యాతనికాదినంబున వలసిన యాహారమిడుటకుఁ దగినవారిని నియమించి, మఱునాఁడు భూసురులకుఁ దనయింట విందుఁజేసి, యాగౌతముని గూడ వారిలోఁగలిపి, మోయలేనంత కనకమును, రత్నములు నాతనికొసంగి పంపెను.

గౌతముఁడు మిగుల ముదమందుచు మూఁపులును, వీఁపులును గొంకుపోఁక యాధనంబును మోసికొనిపోయి, బకంబున్న స్థలంబుఁ జేరెను. ఆకొక్కెర యాతని నాదరించి, తన మిత్రునికతంబున భాగ్యవంతుఁ డయ్యెనని సంతసించుచు, మార్గాయాసమున డస్సియున్న యాతనికిఁ దన పక్షములచే విసరి యాహారంబునఁ దృప్తుంజేసెను. ఆరాత్రి బకంబు నిద్దుర వోవుచుండఁ గృతఘ్నుండగు నాభూసురుఁడు మఱుచటి దినమున నాహారమునకై యోచించి, "ఈబకము మిగుల మదించి యున్నది. దీని నాహారముగాఁ జేసికొందు" నని తలంచి, యొక్క కాష్ఠంబును దెచ్చి దానిచే నాబకంబును జంపి యీకలఁ దీసివేసి, మాంసంబును దీసికొని, డొక్క నచ్చటఁ బాఱవేసి పయనమయ్యెను. తెల్లవారిన యంతనే మధువ్రజ పురంబున విరూపాక్షుఁడు తన మనంబునఁ గలఁతఁ జెంది, "ఈకలఁతకుఁ గారణమేమైయుండును? అనుదినంబును నీసరికి నాసఖుఁడగు రాజధర్ముఁడు వచ్చుచుండునే! నేడేల రాఁడు? ఆబ్రాహ్మణుఁడేమైన నాతని యెడలఁ గీడు తలంచెనేమో! యని విచారించి భటులను బంపించెను. ఆభటులు వచ్చి కొక్కెర యీకలు తీయఁబడియుండుటయు, దానిడొక్కయుఁ జూచి, కడురయంబున నరిగి, దానవేంద్రునకుఁ జెప్పి, యాతని యనుమతిని బ్రాహ్మణుఁడరిగిన మార్గమునుబట్టి పోయి, యాతని నెట్టకేలకుఁ బట్టుకొని, చేతులు విఱిచికట్టి, విరూ

పాతుని కడకుఁ దెచ్చిరి. వికూపాతుఁడు భటులను జూచి "ఈకృతఘ్నుని నాకడ కేల తెచ్చితిరి? వీనిఁజంపి తినుఁడు. లేక మత్తేమయిన సేయుఁ"డని చెప్పెను. భటు లాబ్రాహ్మణుని నచ్చోటినుండి తీసికొనిపోయి, పురంబు బయలునఁ జేర్చి, శరీరమునుండి రక్తముగాఱునట్లు పొడిచి, పాఱవేసినను నాతనిని గుక్కలయినను స్పృశింపలేదు. కృతఘ్నుల శరీరమున మాంసమును దినుటకుఁ గుక్కలైనను రోయునుగదా!

అనంతరము మిత్రుని మృతికి వికూపాతుఁడు చింతించుచు రాజధర్ముని డొక్కఁ దేరఁబనిచి, దాని కగ్నిసంస్కారముఁ గావించెను. తరువాత వికూపాతుని కడకు దేవేంద్రుఁడు వచ్చి మిత్రునకై చింతించుచున్న యాతని కిట్లుపలికెను. "దానవేంద్రా! నీహితుఁడగు రాజధర్ముఁడు చతుర్ముఖునకు సఖుఁడు. ఆతనికై నీవు వగవనేల? ఆతఁ డనుదినంబును దన కడకరుదెంచు చుండుట కాతఁడుగోరుచుండును. పలుమాఱు బ్రహ్మపాలికిఁబోవ కుండుటం జేసి యాతఁ డీదశ నందినాఁడు. ఆతనిడొక్కకు నీవగ్నిసంస్కారము జేసివచ్చిన తరువాత, నా చితిసమీపంబున నొక గోవు తనవత్సమునకుఁ బాలు గుడుపుచుండ, నా వత్సనము నోటినుండివచ్చు ఫేనము వాయువశమున నాదపైఁబడెను. ఆ కారణమునఁ జతుర్ముఖుని మహిమచే నాడీజంఘుఁడు సజీవుఁడయ్యెను." ఇట్లుచెప్పుచుండఁగనే నాడీజంఘుఁడు వచ్చెను. మిత్రుని రాకకు వికూపా

క్షుడు సంతసించెను. రాజధర్ముఁడు తనమూలమున బ్రాహ్మణున కట్టి దీనదశ సంభవించినదని యెఱింగి, రాక్షసఘాతుకులచేఁజిక్కియున్న బ్రాహ్మణుని విడిపించి, విరూపాక్షుఁ డిచ్చిన ధనమును మరల నిప్పించి పంపివేసెను.

ఏ కార్యము సేయవలసినను దీర్ఘాలోచన సేయవలెను.

## 18. చిరకారి.



క. "కార్యవిచారము చిరముగ
ధైర్యముతో నడుపవలయుఁ ♦ దత్తత్క్రియలం
దార్యుఁ డనార్యుఁడు వీఁడని
యార్యులు సేయుదురు నిశ్చ ♦ యమునుచిరముగన్."

ఏదో యొక కారణమున నొక మునీంద్రుఁ డాగ్రహావేశపరవశుఁడై తన కుమారుండగు చిరకారిని బిలిచి తల్లిని జంపుమని యాజ్ఞనొసఁగి మెచ్చటికో యరిగెను. ఏపనిఁ జేయవలసి వచ్చినను మిగుల నాలోచించికాని చేయని యాచిరకారి తండ్రి యాజ్ఞం గూర్చి మనంబున నిట్లని చింతించెను. "మా తల్లిని జంపుమని తండ్రి యాజ్ఞాపించినాఁడు. నేనేమిసేయుదును? తండ్రి యాజ్ఞ మీరుట మహాపాపము. తల్లినిం జంపుటకుఁ జిత్తము సమ్మతింపక యున్నది. జనకాజ్ఞఁ బాలింపక తల్లిని గాచుటయే కర్తవ్యమని తలంతునేని, తండ్రియానతి మీఱిన

వాఁడ నగుదును. నా స్థితి, "ముందు నూయి వెనుక గోయి" యన్నట్లున్నది. మాతృవధ యొనర్చిన నరక మనుభవింప వలసివచ్చునని తలంచినచోఁ దండ్రియాజ్ఞ మీఱుట మాత్రము పాపము కాదా! వంశోద్ధారణార్థమునకుఁ దల్లియందు నన్నుఁ దండ్రి గాంచినాఁడు. ఇరువురును నాకుఁ గావలసినవారలే. ఇందులో నేనెవ్వరిని విడువఁగలను? "అని కొంతసేపు విచారించి మరల నిట్లు తలంచెను. "పితృవాక్పరిపాలనము సమస్త పాపములను బోఁగొట్టును. అదియే సౌఖ్యప్రదము. అదియే సుజనసన్నుతము. అదియే యానందదాయకము. సకల తపములకును, ధర్మములకును, విద్యలకును దండ్రియే మూలము. అతఁడే దైవము. అతఁడే గురుఁడు. అతనికి సంతోషము కలుగు పని జేసితినేని దేవతలుగూడ సంతసించెదరు" అని, మరలఁ దల్లిదెసఁ దలఁచి యిట్లని చింతించె. ఈశరీరోద్భవమునకుఁ దల్లియేకదా కారణము. నిజశరీరపోషణము విషయమై శ్రద్ధదీసికొనక దుర్భరంబగు కష్టములఁ బొంది, నన్ను గాంచిన తల్లికష్టమే యెక్కుడుకష్టము. తన కుమారుఁడు బాలుఁడైనను, వృద్ధుఁడైనను, వానిని దల్లి యొక్క తీరుగనే యరయుచుండును. ఆమాతృప్రేమయే జగంబంతు లత్యున్నతికిఁ గారణము. ఏ మానవునకు మాతృవియోగ మెప్పుడు సంభవించునో, యప్పుడు వాఁడేపనిఁ జేయుటకును సమర్థుఁడగును. అప్పుడే వాఁడు శోకసముద్రమున మునుఁగును. భాగ్యవంతునికైనను, దరిద్రునికైనను, మూఢునకైనను,

మాతృభక్తి సమానముగ నేయుండును. అట్టియెడల మాతృవధ మహాపాపవారాసియందు ముంచివేయును. మాతృభక్తి యనునది పశువుల వధించి, జీవించుకటికవానికైనను దెలియును. మాతృభక్తిని విడిచి యీమెను వధించుటకు నాకుఁ జేతు లెట్లాడును.

దీర్ఘాలోచనము జేసికొని, యెట్టి కార్యమును జేయని వాఁడగుటచే చిరకారి, యనేక విధముల నిట్లు యోచించు చుండుటంజేసి కడుఁ దడవయ్యెను. ఇంతలో నాతని జనకుఁడు తన మనంబున "అక్కటా! మహాక్రూరకార్యము సేయుమని నా కొడుకున కాజ్ఞాపించి వచ్చితిని. ఈ పని యీతఁడు చేసి యుండునేమో?" యని చింతించుచు వచ్చి యా శ్రమము ముందు దీర్ఘాలోచనము సేయుచున్న కుమారునిఁ జూచి యాతఁడు తల్లిని వధించి యుండ నందులకు సంతసించి, "వత్సా! మహాపుణ్యశీలుఁడవగు నీవు నాగర్భమున జనించితివి. భవదీయ జననముచే నాతపము ఫలించినది. నీతల్లిని వధించు విషయమున దీర్ఘాలోచన పరుఁడవై యుండి నా కెంతయు మేలు జేసితివి. నీ చిరకారి నామము సార్థకము జేసికొంటివి. నాకు నింద రాకుండునట్లుగను, నాతపమునకు భంగము కలుగకుండు నట్లుగను, ననుఁ బాపము జెందకుండు నట్లుగను, జేసిన నీదీర్ఘాలోచనము సకల దేవతలచే సన్నుతింపఁ బడుఁ గాక!" యని పలికెను. చిరకారియుఁ దండ్రివాక్యములాలించి

తల్లిని జంపుటకుఁ దనహస్తమున బూనియున్న యాయుధము నేల విడిచి యమ్మునీంద్రునకు సాష్టాంగ దండప్రణామంబు లొనర్చెను. అంతట మునిపత్నియు వచ్చి భర్తకు మ్రొక్కెను.

---

దుర్బలుఁడు ప్రబలునితోఁ దొడరరాదు.

## 19. పవనుఁడు - శాల్మలీతరువు.

హిమాచలమునకు సమీపమున నొక శాల్మలీతరువు కలదు. అది మిగుల దృఢముగలదై శాఖోపశాఖలతో విరాజిల్లుచు ననేక మృగపక్షి సముదాయమున కాశ్రయస్థానమైయుండెను. ఒకనాఁడునారదమునీంద్రుఁడావృక్షరాజము కడకేఁబోయి "నీవింతపొడవు గల్గి యనేక మృగపక్షులకు నివాసస్థానమై యొప్పుచున్నావు. నిన్నుఁజూచిన నాకెంతయు ముదముగలుగుచున్నది. కాని, యొక్కసంశయము మాత్రము నన్ను బాధించుచున్నది. సాధారణముగా వాయువు చేత ననేక గొప్పవృక్షములు గూలుచుండును. నీవు మాత్రమట్లు కూలకయుంటివి. ఇందులకుఁగారణమేమి ? మారుతునకును నీకును నేమైనఁజుట్టరికమున్నదా ? అతఁడునీయందు దయఁజూచుచుండునా ?" యనిపలికెను. అందులకాభూరుహము "వాయుబలము నా బలముతో సమముగాదు." అని బదులు చెప్పెను. "అట్లుపలుకవలదు. పవనునిముందు కొండలే యూగవు"

అని నారదుఁడు మరలఁబలుక, శాల్మలీతరువు గర్వముతో "ఘనమూల ప్రబల శాఖాయుతుఁడనైన నన్ను వాయువు నాఁకి నచో నాతని ప్రభంజన నామమునకు భంగము వచ్చునని భయం బందు చుండును" అని బదులు చెప్పెను. ఇట్లుగర్వించి పలికిన శాల్మలీవృక్షమును జూచి "నీవిప్పుడు పలికిన మాటలు మరువ వలదు" అని చెప్పి నారదుండచ్చోటువాసి, పవనుని జేరి శాల్మలీ పలికిన పలుకులు వినిపించెను.

వాయువామాటలువిని కోపముఁ బూని, రోషాక్షణము నసే శాల్మలీతరువుంజేరి "నేను కృపఁబూని యుండుటచే నీవింతవఱకు నశింపక యుంటివి. దానికింత గర్వించి నారదు నితోఁ బలికితివిగా" యనెను. అందులకా భూరుహము "నీవట్లు పలుకుటకు నేను నీ కంటె దీసిపోయితినా? లోకములోనున్న తక్కినవృక్షములను నన్నును నొక్కతీరునఁ జూడఁదలఁచితివా యేమి? నా బలము నీకుఁదెలియ" దని పలికెను. ఆమాటలకుఁ బవనుఁడు మరల "ఒకనాఁడు బ్రహ్మ నీ కడకు వచ్చి విశ్రమిం చుటఁజేసి యాతని కృపకుఁ బాత్రవైతివి. నేనును నా కారణమున మన్నించితిని. కానిమ్ము. నీ బలమెట్టిదో చూచెద" నని పలికి వెడలెను. పవనుఁడరిగిన పిమ్మట నావృక్షముతనలో "అక్కటా! నేనట్లు నారదునితో వచించితిని! వచించితిని గాక! నారదుఁడామాటలు పవనునకేల చెప్పవలయును? చెప్పినంతనే మారుతుఁడు నాయొద్దకువచ్చినప్పుడు నేనేల

గర్వమున మాటలాడితిని ? మహాబలుఁడైన వానిముందు నేను నిలువఁగలనా ? అతఁడు రేపు నామీఁదకు రాకమునుపు నేనే యాతనినొక విధమున గెలువ వలయు" ననితలంచి, తన్నుదానవిఱచికొని పడియుండెను. మఱునాడు ప్రభంజనుఁడు వచ్చి, పడియున్న శాల్మలీ తరువుంగాంచి "నేఁ జేయఁదలఁచిన పని నీవేచేసికొంటివా !" యని యుల్లసంబాడి చనెను.

మత్సర గ్రస్తుఁడయి దుర్బలుఁడు ప్రబలునితోఁ దొడరినచోఁ దన విభవమును గోల్పోవును.

---

దైవారాధనమే మోక్షసాధనము.

## 20. గజేంద్రుఁడు.

త్రికూటాచలమను నొకపర్వతరాజముకలదు. ఆపర్వత ప్రాంతమునఁ బెక్కు సెలయేళ్లు ప్రవహించుచుండును. ఆశిఖరముపై విహరించుట కనుదినంబును దేవతలు విమానముల మీఁద వచ్చుచుందురు. అనేక పుష్పలతలచేతను, ఫలభూజములచేతను, ననేక పక్షులచేతను నొప్పు నాపర్వతరాజము మిగుల సౌందర్యముగా నుండును. దానికి సమీపమున నొక మహారణ్యముండెను. ఆ యరణ్యమునఁ గల గజంబులన్నియు నొక దినమున గుహలనుండి వెడలి, మందమందలుగా నదికిఁ బోవ బయలుదేఱి, మార్గమధ్యమునఁ దొండములచేఁ జెట్ల

కొమ్మలను విఱుచుచు, భూజములఁ బెకల్చుచుఁ, జివురుజొంపముల మేయుచు, నొకదాని కొకటి యందిచ్చుకొనుచు, విలాసముగాఁ బోవుచుండెను. అట్టి సమయమున నొక కరీంద్రుఁడు ముందువెనుకలు తన్ను సేవించుచు వచ్చుచున్న యేనుఁగుల గుంపును బాసి, విధివశమున మార్గముతప్పి కొన్ని యేనుఁగులతో మఱియొక త్రోవఁ బోయెను. ఇట్లు పోయిపోయి యడవియంతయుఁ దిరిగి తిరిగి, దాహబాధనంది, యొక జలాకరంబును జేరెను. అట్లు చేరిన యాగజము నీటిలోదిగి దాహమార్చుకొని విలాసార్థము తొండమున నీరుఁ బూరించి, జలచరములు భయమందునట్లు విడచుచు, జలమంతయుఁ గలఁచి వేయుచుండఁ, గడురయమున నొక మకరివచ్చి, యాకుంజరము పాదమును బంధించెను.

గజమునకు ఎంత బలమున్నను మొసలి యెదుటఁ ప్రయోజనము లేకయుండెను. అయినను గజేంద్రుఁడు ధైర్యము విడువక మకరిని దంతములచే బొడిచియుఁ, దొండముచే మోదియు, ననేక విధములఁ దప్పించుకొనుటకు ప్రయత్నించుచుండెను. కరి మకరముల పోరాట మతిదారుణమయ్యెను. ఒకరి నొకరు గెలువవలయునను పట్టుదలతో రేయుంబవళ్ళు పోరాడుచుండిరి. అంతకంతకు గజేంద్రుని బలము సన్నగిల్లుచుండెను. మకరికి బలమెక్కువయగుచుండెను. ఇఁక జీవించుట కష్టమని గజేంద్రుఁడధైర్యమంది తన మనంబున "అక్కటా!

నేనీ జలగ్రహము నెట్లు గెలుతును? ఎవ్వరునన్ను రక్షించుటకు వచ్చెదరు? అరణ్యమున ననేక గజములు గొలువ, రాజనై యుండు నేను సుఖముగా నుండక యీహ్రదమున కేలవచ్చి తిని? ఈశ్వరా! భయంబెట్లుడిపెదవు?" అని చింతించి తనకా సమయమున శ్రీమన్నారాయణమూర్తి తప్ప, రక్షింపఁ దగినవారు లేరని యామహాత్ముని నిట్లని ప్రార్థించెను.

"లోకముల కన్నిఁటికిని గారణుఁడ వైన నిన్నునే నాశ్రయించు చున్నాను. మునులును దేవతలును నెవ్వరిని బ్రార్థించి శుభములఁ గాంచు చుందురో అట్టి నిన్ను నేను శరణుఁ బొందుచున్నాను. ఓభక్తరక్షకా! నీవు నాకు దిక్కగుము. ఓసర్వవ్యాపకా! ఈమకరితోఁ బోరాడుటఁ జేసి నా శక్తి తగ్గినది. ప్రాణములు తమ తమ స్థానములు తప్పుచున్నవి. నీవుతప్ప నాకెవ్వరును దిక్కులేదు. రక్షింపుము."

ఆ సమయమున శ్రీహరి వైకుంఠపురమున రమాదేవితో వినోద సంభాషణము సేయుచుండెను. గజేంద్రుని మొఱ యాతని చెవులకు వినవచ్చెను. వెంటనే యాతఁడు కరిని రక్షింపఁదలఁచి లక్ష్మీదేవికైనఁ దెలుపక చక్రము మొదలగు బాణములనైనఁ బుచ్చుకొనక, పరివారమునైన వెంట రమ్మనక బయలుదేఱెను. ఆతఁ డెక్కడి కేపనిమీఁదఁ బోవు చుండెనో యెవ్వరికిని దెలియదు. అట్లు పోవుచున్న యా శ్రీమన్నారాయణుని వెంట లక్ష్మియు, నామె వెంటఁబరిచారికా

జనంబులును, గరుడుఁడును, నారదుఁడును నరిగిరి. శ్రీహరి యుత్తరీయమును బట్టుకొని, పోవుచున్న లక్ష్మీదేవి తన మనంబున "ప్రాణేశ్వరుఁ డెచ్చటికిఁ బోవుచుండెను ? అమరలోకముపై నెవ్వరైన నసురులు దాడివెడలిరో! దుష్ట దానవుఁ డెవ్వఁడైన వేదములఁ దస్కరించెనో! భగవంతుని జూపింపుమని యేభక్తుడైన ఖలులు వేధించుచుండిరో! ఏభక్త శిఖామణియైన మహాపదఁ బొందియుండెనో!" యని పరిపరి విధములఁ దలఁచుచుండెను. శ్రీహరి యరుగుచుండఁగా మార్గ మధ్యమున మింటనున్న యమరులు నమస్కరించినను, కరిని రక్షింపఁ ద్వరితగమనమునఁ బోవునతఁడు నమస్కారముల నైనఁ గైకొనలేదు. ఆతఁడు తిన్నఁగాఁ గరిమకరములుపోరాడు చున్న కమలాకరంబును సమీపించి, చక్రమును దలంచెను. వెంటనే చక్రమువచ్చి నీరాశిని ప్రవేశించి, మకరిశిరమును ద్రుంచివేసెను. అనంతరము దయాంతరంగుఁడైన శ్రీహరి తన హస్తముచే గజేంద్రుని శరీరము నిమిరి, మదువు వెడల దిగిచెను. శ్రీహరి హస్తసంస్పర్శవలనఁ గరీంద్రుఁ డాయాసము వాసి యధికోత్సాహవంతుఁడై ఘీంకారరవమాచరించెను.

శరణాగతరక్షణమునకన్న సుకృతములేదు.

# 21. శ్యేనము - కపోతము.



పూర్వకాలమున శిబి యను నొక చక్రవర్తి నిరంతర ధర్మవ్రతాచార పారీణుఁడై ధరాతలంబుఁ బరిపాలించుచు ననేక యాగములు గావించి, పెక్కండ్రు భూసురులను వివిధ దానంబులచే సంతృప్తిఁ జేయుచుండెను. ఎన్ని విధములయిన దానములు శాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నవో యట్టివన్నియు నాతనిచేఁ జేయఁబడినవి. ఆతని యశోవల్లిక సమస్తలోకములఁ బ్రాకెను. ఇంద్రుఁడును నగ్నియు నాతనిగుణంబులఁ బరీక్షింపఁ దలఁచి, ఒకఁడు డేగయై, యింకొకఁడు పావురమై బయలు చేరిరి. డేగ వలన భయంబందిన చందమునఁ బావురము కడు రయమున శిబిం జేరి శరణుఁ బొందెను. పావురమును దరుము కొనుచువచ్చిన డేగ, శిబింగాంచి "రాజేంద్రా! నీవు సమస్త ధర్మంబులను నెఱింగియున్నవాఁడవు. నేను క్షుద్బాధనంది యీ పావురము వెంటఁ దగిలితిని. దీనిని నీవు భంగముసేయుట తగదు. డేగలకుఁ గపోతంబు లాహారంబు కాఁ దగినవి. నా కుటుంబము దీని నాహారముగాఁ గొనకున్నచో జీవింపదు. నీ వీయొక్క పావురమును రక్షింపఁ బూనినాడవు. దీని వలన ననేక ప్రాణులను హింసఁ బెట్టిన వాఁడవగుదువు," అని పలికెను. శిబిచక్రవర్తి యాడేగం జూచి "ఓ శ్యేనమా!

నీవచనములు సత్యములే. కాని ప్రాణభయంబునఁజేసి, యీ కపోతము నన్ను శరణుఁ బొందినది. శరణాగతత్రాణ బిరు దాంకితుఁడనగు నేను దీనిని విడనుట ధర్మముగాదు. నీవు పులుఁగువై యొప్పుచున్నను ధర్మమును వక్కాణించు చున్నావు. ఇంతకును నీ యాఁకలి బాధకుఁ గదా యీపావు రమును జంపఁ దలంచితివి. ఈ యరణ్యమున ననేక పక్షిజంతు మాంసము నాహారముగాఁ గొని యాఁకలిఁ దీర్చికొనుము. కపోతము జోలికిఁ బోవకు" మని నుడివెను.

డేగ యావదాన్యుండగు చక్రవర్తింగాంచి యిట్లనియె.

"ఆ. నాకు విహితభక్ష ♦ ణంబిది యిప్పక్షిఁ
బూని కావనీకు ♦ బుద్ధియేని
నవనినాథ! దీని ♦ యంత నీమాంసంబు
దూఁచి నాకుఁబెట్టు ♦ తొలఁగకిపుడు."

అందులకా చక్రవర్తి సంతోషముతో 'వల్లె'యని తత్క్ష ణంబ తన శరీరముయొక్క వివిధాంగములఁ గల మాంసంబును గోసి త్రాసునందు వేయుఁ గపోతమె యెక్కువభారముగఁ గని పించుచుండెను. అందులకా ధరణీనాథుఁ డద్భుతమంది రక్తమయమగు శరీరము వహించిన తానె త్రాసు నలంక రించెను. అంతట నాడేగయుఁ బావురంబును నారూపముల విడిచి నిజరూపములతో శిబి యెదుట నిలిచి "భూవల్లభా! మేమిరువురము నింద్రాగ్నులము. నీగుణము పరిశీలించు

టకై యిట్టి వేషములఁ బూని వచ్చితిమి. నీధర్మసంధతకు మేమెంతయు మెచ్చితిమి. భవత్కీర్తి యాచంద్రార్కతారా వనీశరధిస్థాయిగ నుండుఁగాక" యని పలికి తమలోకమున కేగిరి.

రాజభక్తి గలిగి యుండుము.

## 22. వీరవరుఁడు.

సత్యసంధుఁడును, ధర్మమూర్తియు నని జగత్ప్రసిద్ధి వహించిన శూద్రకుండను నొక మహారాజు గలఁడు. ఆతని యొద్ద కొక దినంబున మహాబలశాలియుఁ బరాక్రమవంతుఁడును నగు వీరవరుఁడను నొకక్షత్రియు వీరుఁడుద్యోగార్థియై వచ్చెను. శూద్రకుఁడాతనిని వీక్షించి "క్షత్రియవీరా! నాయాస్థానమునఁ గొలువుసేయఁ దలఁచిన నీకు నేనేమి యుద్యోగమిత్తును? నీవేమి పని సేయుదువు? నీకేమి వేతనము గావలయు" నని యడిగెను. అందులకు వీరవరుఁడు "రాజేంద్రా! హస్తద్వయమును ఖడ్గమును నాయొద్ద నున్నవి. వీనిని నీనిమిత్త మేయుద్యోగము నందైన బ్రవర్తింపఁజేసెదను. ఇందులకావంతయు సందియము లేదు. నాయందనుగ్రహముఁబూని నీవునాకు దినమున కైదు వందల బంగారు నాణెముల నొసంగవలయు" నని పలికెను. జీతమెక్కువగ నున్నదని చిత్తమునఁ గొంతసేపు యోచించి,

మెట్టకేలకంతులకు సమ్మతించి వీరవరునిఁ దన యాస్థానము నందుంచుకొనెను.

వీరవరుఁడు శూద్రకుని యాజ్ఞ ననుసరించి రేయిం బవళ్లాతని మందిరమును గాచుచు భక్తితో సేవించుచుండెను. ఆతఁడు తన జీతములో సగభాగము దేవతారాధనములకును, భూసురులకును, బీదజనులకును వినియోగ పఱచుచుఁ గడు ధర్మబుద్ధిగలవాఁడై యుండెను. ఇట్లుండ నొకనాఁటి యర్ధరాత్రి నగరమున నొక మూలనుండి, యొక స్త్రీ యేడుపు రాజునకు వినవచ్చి యావృత్తాంత మెఱింగిరమ్మని యాతఁడు వీరవరున కాజ్ఞాపించెను. వీరవరుఁడు ఖడ్గధరుఁడై యాయార్తారావము వినవచ్చిన దెసకుఁబోయెను. శూద్రకుఁడు గూడ నాతనికి గనఁబడకుండ వెనుకనే పోయెను. వీరవరుఁడు నగరమునకు వెలుపలనున్న లక్ష్మీదేవి యాలయమును జేరి, యచ్చట విలపించుచున్న యొక స్త్రీనిఁజూచి, ధైర్యముతో "తల్లీ! నీవెవ్వరవు? ఎందులకు విలపించుచున్నా"వని యడిగెను. అందులకా స్త్రీ "నేను శూద్రకుని రాజ్యలక్ష్మిని. నేనిప్పు డాతనిని విడిచిపోవుచుంటిని. అందులకై యేడ్చుచున్నా"నని బదులుచెప్పెను. రాజభక్తి గల వీరవరు డామాటలు విని మిగుల జింతించి, కొంచెము ధైర్యముదెచ్చుకొని "తల్లీ! నీవు మారాజును విడువకుండ నుండు నుపాయ మేదైన నున్నదా? చెప్పుము"అని యడిగెను. ఆతని వాక్యమునకు

లక్ష్మి "నీ కుమారుని నాకు బలిగా సమర్పించితివేని నేను శూద్రకుని విడువ"నని చెప్పి యదృశ్యయయ్యెను.

ఆరాజ్యలక్ష్మి పలికినమాటలువిని, వెంటనే వీరవరుఁడు తన గృహంబునఁజేరి, భార్యాపుత్రుల కాసంగతి వినిపించెను. పితృభక్తిగల వీరవరుని కుమారుఁడా మాటలువిని యాతని కిట్లు పలికెను. "నీవీ సమయమున నొక్కింతయు విచారింపవలదు. మనలఁ బోషించుచున్న రాజును మనము రక్షించవలయును. రాజభక్తి కన్న మఱియొక సుకృతము లేదు. రాజ్య సంరక్షణమునకై మనమెన్ని శ్రమలనైనను బడవలయును. కావున నేను రాజునిమిత్తము రాజ్యలక్ష్మికి నాప్రాణములు సమర్పించుటకు సిద్ధముగా నున్నాను. నీవు నన్నుఁ గూర్చి దుఃఖింపవలదు. ఇంతకన్న నాకు మఱియొక భాగ్యమేమి కావలయును? ఈశరీరములును సంపదలును స్థిరములు కావు. కీర్తి యొక్కటియే యాచంద్రతారకముగ నుండును. ఇంక నీవు సంశయింపక నన్నారాజ్యలక్ష్మికి బలిగా నొసంగి రాజ్యమును గాపాడుము."

భార్యగూడ వీరవరునకు ధైర్యముఁ జెప్పి రాజ్యసంరక్షణార్థము కొడుకును హింసింపుమని వచించెను. బాలుఁడైన కుమారుని ధైర్య సాహసములకును, భార్య సుశీలతకును వీరవరుఁ డపరిమితానందమును బొంది, వారిని వెంటఁ బెట్టుకొని లక్ష్మిదేవియాలయమునకుఁ బోయెను. ఆముగ్గురును. "తమ

రాజునకు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యముల నిమ్మని రమా దేవిని బ్రార్థించిరి. వీరవరుఁడు కొడుకుంగాంచి "కుమారా! నిన్నీక రాజునిమిత్తమీ లక్ష్మీదేవికి బలిగా సమర్పించుచున్నాను. నీచిత్తమున నేవిధమయిన చింతయు లేదుకదా!" యని యడిగెను. అందులకుఁ గుమారుఁడు తన మనస్సు నిశ్చలముగ నున్నదనియు, నిఁక నాలసింపక తన్ను వధింపుమనియుఁ దండ్రికిఁ జెప్పెను. అంతట వీరవరుఁడు ఖడ్గముచేఁ గుమారుని కంఠమును ఖండించి, "రాజ్య సంరక్షణార్థము కుమారుని వధించితిని. పుత్త్రుఁడు లేనప్పుడు నేనుమాత్రము జీవించినందువలనఁ బ్రయోజనమేమి?" యని తలంచి, కృపాణముచేఁ గంఠమునుఁ బొడిచికొని యసురులఁ విడిచెను. పుత్త్రుని యొక్కయు, భర్త యొక్కయు, మరణముఁ జూచి సాధ్వియగు వీరవరుని భార్యయుఁ బ్రాణములు విడిచెను.

వీరవరునకుఁ దెలియకుండ నాతని వెనుకనే వచ్చి దేవాలయమునకుఁ గొంచెము దూరముగా నిలిచియున్న శూద్రకుఁడా ముగ్వురును లోనఁ బ్రవేశించి యెంతసేపటికిని నీవలకు రాకుండుటచే నాలయంబును బ్రవేశించి, యామువ్వురి మృత కళేబరములను జూచెను. రాజభక్తిచే నిరాజిల్లు నావీరవరుఁడట్టి మృతినందుటకుఁ గారణమేమైయుండునాయని విచారించి లక్ష్మీదేవి నుద్దేశించి "ఓదేవీ! వీరు మువ్వురును నిట్లు మృతిఁ బొందుటకుఁ గారణమేమి?" యని యడిగెను. లక్ష్మీదేవి యాతనికి బ్రసన్నయై వారిమృతికిఁ గారణముఁ జెప్పి

"రాజేంద్రా! నీకుసంపూర్ణాయుర్భాగ్యముల నిచ్చుచున్నాను" అని వచించెను. ఆమాటలకు రాజేంద్రుఁడు " తల్లీ! ఈ వీర వరుఁడు భార్యాపుత్రులతో నానిమిత్తము ప్రాణములు విడిచి నాఁడు. ఇట్టి రాజభక్తుఁడు లేని నాకీ భాగ్యమేల? ప్రాణము లేల? నేనుగూడ నాతనిమార్గ మనుసరించెద. అట్లుగాక నీకు నా యందు దయగలదేని వీరవరుని భార్యాపుత్ర సహితముగ బ్రదికింపు" మని పలికెను.

లక్ష్మీదేవి యా రాజేంద్రుని గుణమునకు సంతసించి " వీరవరుఁడు భార్యాపుత్రులతో జీవించుఁగాక" యని పలికి మాయమయ్యెను. వీరవరుఁడును భార్యయుఁ బుత్రుఁడును నిద్రనుండి లేచినవారి చందమున లేచిరి. శూద్రకుఁడు వారికిఁ గనఁబడకుండ నిజమందిరమున కరిగెను. వీరవరుఁడు భార్యను పుత్రుని గృహంబున విడిచి, రాజమందిరమున కరిగెను. శూద్రకుఁడు వీరవరునిజూచి, " వీరవరా! మనకు వినిపించిన యా స్త్రీ రవమెవ్వరిదో కనుగొంటివా? అచ్చటి వృత్తాంత మేమి" యని ప్రశ్నించెను. అందులకు వీరవరుఁడు " మహా రాజా! ఆస్త్రీ యార్తనాదము వినవచ్చిన దెసకుఁబోవఁగా, నొక్క స్త్రీ నన్నుఁజూచి మాయమయ్యె" నని బదులు చెప్పెను. స్వలాభమును గోరి యెట్టివాక్యములును బలుకని వీరవరుని గుణములకు శూద్రకుఁడు మిగుల సంతసించి, ఆ మఱునాడు తన మంత్రులతో నావృత్తాంతముఁ జెప్పి, యాతనికిఁ గొంత రాజ్యమునిచ్చెను.

---

విధికృతము నెవ్వరును తప్పింపఁజాలరు.

# 23. సు శీ ల .



సౌవీరదేశము బాలించు రాజేంద్రునకు సుశీల యను నొక పుత్రిక యుండెను. ఆతఁడా కుమారిని దన చెలియలి కొడుకునకిచ్చి వివాహముసేయఁదలంచెను. తన యన్నపుత్రున కీయవలయునని నృపాలుని భార్య తలంచియుండెను. ఈవిష యమై భార్యాభర్తలకు వివాదము జరిగెను. ఎట్టకేలకు రాజు కన్యకను దన చెలియలి కొడుకున కీయ నిశ్చయించి, భార్య యెఱుంగకుండ, నాతనిని రప్పించి యొకచోట నుంచెను. రాజు భార్యయుఁ దన యన్నసుతుని రప్పించి రహస్యముగా నొక మందిరంబున నుంచెను. అయ్యవసరమున బ్రహ్మ, విష్ణు, మహేశ్వరు లాకాశవీథిం బోవుచు, నా యిరువురు పెండ్లి కొమరులఁ గాంచిరి. శివుఁడు విరించిం జూచి "రాజపుత్రిక కా యిరువురిలో నెవ్వఁడు భర్తయగు" నని యడిగెను. అందులకుఁ బద్మజుఁడు నవ్వుచు "ఆ యిరువురిలో నెవ్వనికిని రాజకన్యక లభింపదు. ఆమె మఱి యొకని పాలగును" అని చెప్పి యాదారిని బిచ్చమెత్తుకొనఁ బోవుచున్న యొక పిచ్చుగుంటుం జూపి, యాతఁడా నృపాలపుత్రికకు వరుండగు" నని చెప్పెను. ఈమాటలువిని శివుఁడు కేశవుం గాంచి "వింటివికదా నీ తన యుని కొంటెతనము. రాజ పుత్రికను బిచ్చగాని కిచ్చి

వివాహము సేయుదురఁట. ఇట్టి మాటల నెక్కడ నైన వింటిమా! యని పలుక, "నేనసత్యమాడను. నా పలుకు తప్పదు. మీరు పరీక్షింపవచ్చు" నని బ్రహ్మ నుడివెను.

అంతట బ్రహ్మ వాక్యములయందు సత్యాసత్యములు బరీక్షింపనెంచి, పరమేశ్వరుఁడు శ్రీహరి నడుగఁగా, శ్రీహరి గరుడుని రావించి బిచ్చగాడైన యాపిచ్చుగుంటుని సముద్రమునకావల నొకమహారణ్య మధ్యమున విడిచిరమ్మని యాజ్ఞాపించెను. గరుడుఁడు శ్రీహరి చెప్పినయట్లు చేసెను. అట్లు కాననమధ్యమున విడువఁబడిన యా భిక్షుకుఁడు మనంబున దైన్యంబెసఁగ "అక్కటా! నన్నా పక్షీంద్రుఁ డీ మహారణ్యమునఁ బడవేసి దిక్కులేనివానిగ నొనర్చెను. పురంబునఁ బుణ్యకాంత లిడుచుండు నన్నముఁ దిని జీవించుచున్న నాకిట్టి సంకటమేల ప్రాప్తించెనో కదా! ఆకలిచేఁ గడుపు దహించుకొనిపోవుచున్నది. లోకనాయకుఁడైన శ్రీమన్నారాయణుఁడు నాయందేల కరుణింపక యున్నవాఁడు" అని చింతించుచుండెను. శ్రీహరి వాని హృదయంబున నెఱిఁగి, వినతాసుతుం బిలిచి వానియాకలిఁ దీర్పుమని నియమించెను. అంత గరుడుఁ డా పురమున రాజమందిరమున శాకాన్న దధిఘృత పాయసభక్ష్యాది వివిధపదార్థంబులు గల భోనకావడిం గని దానిం గొనిపోయి యరణ్యమున నున్న పిచ్చుకుంటుముందు బెట్టి యిందున్న యశనంబు భుజింపుమని నుడివి చనెను.

బిచ్చగాఁడు బోనపుటికఁ దెఱచిన యంతనే యందుండి దివ్యసౌందర్యముగల యొక కన్యకామణి యీవలకు వచ్చి తన కరంబున నున్న రత్నహారంబు వాని గళంబున నలంకరించి, వివిధభక్ష్యంబులఁ బెట్టి తినుమని పలికెను. భిక్షుకుఁడాహారంబును దృప్తిగా భుజించి యాయువతిం గాంచి "నీ వెవ్వరవు? నేనెవ్వఁడను? నీవిట్లు సేయుటకుఁ గారణమేమి?" యని యడిగెను. అందుల కా కన్యకామణి యిట్లు బదులుచెప్పెను. "నేను సౌవీరమండలాధీశ్వరుని పుత్రికను. సుశీల యను దాన. నన్నుఁ దన చెలియలి కొడుకునకు నిచ్చి పెండ్లి సేయుదునని నాతండ్రియు, నన్నుఁ బుత్రున కిచ్చి వివాహము సేయుదునని తల్లియు జగడమాడిరి. నాతల్లి నన్ను బోనపుటిక యందుంచి దీనిం దెఱచినవానిని వరింపుమని చెప్పినది. నీవు నాకు వరుండవైతివి." ఈ మాటలు విని భిక్షుకుఁడు సముద్రము దాఁటి యరణ్యములో దిక్కులేక దిక్కైన తనకు దివ్యసుందరి లభించినందులకు సంతసించుచు, విరించిచేత కచ్చెరువు బొందుచుండెను.

నగరములో వివాహలగ్నము సమీపించెను. పెండ్లికూఁతురు కనఁబడదయ్యెను. రాజేంద్రుఁడు భార్యపైఁ గినిసి కూఁతుం దెచ్చి చూపుమని యడిగెను. భార్య, భర్తకు "భూవల్లభా! నన్నేల యడిగెదవు? నాయిచ్చవచ్చినయట్లు సేయుదునని నీవు నిష్ఠురభాషలు పలికిన నాటనుండియు నేను దానిం గూర్చియే విచారింపకయుంటిని. నీవెచ్చటనుంటివో, నీకూఁతు

రెచ్చటనుండెనో నాకేమియుఁ దెలియదు" అని కోపముతోఁ బలికెను. అందులకు రాజేమియు మారు పలుకఁజాలక యుండెను. విఫలమనోరథులయిన పెండ్లికొమరు లిరువురును నగరము విడిచి చనిరి.

ఈ విధమంతియుఁ గని మురాంతకుఁ డంబుజగర్భుని విలోకించి, పెండ్లికొడుకు లెవ్వరికిం దెలుపకుండఁ బ్రోలువిడిచి పోవుచుండిరేమని యడిగిన, విరించి "దేవా! రాజకన్యామణి నీభక్తుఁడయిన భిక్షుకుని జేరినది. ఇంక నీపెండ్లికొమరు లిచ్చట నుండి యేమిసేయుదు" రని బదులు చెప్పెను. విధాతవాక్యములు నిజమయ్యెనని సంతసించుచుఁ బరమేశ్వరుఁడును, శ్రీహరియు, నాతనితో బ్రాహ్మణరూపములతో సముద్రమునకావల నరణ్యమధ్యమున సుశీల సహితుఁడై యున్న భిక్షుకుని కడకుఁ జనిరి. ఆ దంపతులు త్రిమూర్తులను గాంచి భక్తితో నతిథిసత్కారంబుఁ గావించిరి. త్రిమూర్తులు వారి గుణంబులకు మెచ్చి పెక్కువరంబులిచ్చిరి. భిక్షుకుఁడు దేవతావరప్రభావమున దివ్యరూపమును గాంచెను. సుశీల యాతనితో నిజపురంబును జేరి తల్లిదండ్రుల కావృత్తాంతము దెలుప, వారెంతయు సంతసించిరి. భగవదనుగ్రహమును వడసిన భిక్షుకుఁ డాతెఱంగున రాజున కల్లుఁడై దండనాయక పదవి నందెను.

# 24. అన్నదానపరుండగు బ్రాహ్మణుఁడు.



## I

ఒక నగరంబున నొక బ్రాహ్మణునకు మువ్వురు కొడుకులుండిరి. అందు మూఁడవవానిపేరువిష్ణుశర్మ. విష్ణుశర్మ విద్యాధికుండగుటయే గాక, ధర్మశీలుఁడై యనుదినము విప్రుల కశనమును బెట్టుచుండును. తల్లిదండ్రులుగాని, యన్నలుగాని, యాతని చేతలకు నడ్డుగల్పింపక యుండిరి. ఇట్లు పెక్కుదినములు గడచిన పిమ్మటఁ దల్లిదండ్రులు మరణించిరి. అన్నదమ్ములు మువ్వురును గలిసిమెలసి యుండిరి. అప్పుడును విష్ణుశర్మ యతిథులకు నన్నదానముఁ జేయుచుండెను. ఈ కారణమున వారి యింట సిరి కదలక యుండెను. ఇట్లు జరుగుచుండ వదినె లాతని ధర్మసంధతఁ జూచి యసూయవహించి, దానికి విఘ్నమొనరింప నెంచి, రహస్యముగాఁ దమ భర్తలనుగాంచి యిట్లనిరి. మిమ్ముఁ జూచి మేమేమియు నోరెత్తక యిన్ని దినముల నుండియు నూరక యుంటిమి. ఇంట జరుగు సంగతులు మీరు గ్రహింపలేకుండిరి. ఒకనాఁడైనను మాతో నాలోచింపరు. మాతోడికోడలున కేవలి చెప్పుటకైనను భయమగుచుండును. ఆమె మాకు సత్తయైనది. మీతమ్ముఁడు మామయైనాఁడు. మే మా యిరువురిచేతను బాములు బడలేక యున్నాము. బ్రాహ్మణుల పేరు చెప్పుకొని యనేక

పదార్థములఁ జేసికొని కడుపునిండఁ దినుచు, వారసతిరీతి గోళ్ళనుమీటుకొనుచు, మాతో గోదగొట్టు తోడికోడలుతో బ్రదుకఁ జాలము. మీతమ్ముఁడు చేయు పనులకు మీరడ్డము చెప్పక యుండిరి. ఇట్లైన జీవన మెట్లు గడచును. ఆతఁ డార్జింపక మీరు తెచ్చిన దంతయు బ్రాహ్మణులకు బెట్టు చున్నచో మీ కేముండును. ఇఁక మీరు విభక్తులు గావల యును. ఉమ్మడి సొమ్ము కావునఁ దన యిచ్చవచ్చినయట్లు బాఱఁజల్లుచుఁ బ్రదాతనని విఱ్ఱవీఁగుచున్నాఁడు. వేఱుపడినచో నది తెలియవచ్చును."

ఇట్లు తమభార్యలు పలికిన విని, యన్నలోకనాఁడు తమ్ముఁడగు విష్ణుశర్మకుఁ జెప్పవలసిన విషయంబులన్నియుఁ జెప్పి, పితృధనం బాతనికిఁ బంచియిచ్చి వేఱుగనుంచిరి. పెద్దవారిద్దఱును నొద్దికవై కలిసియుండిరి. విష్ణుశర్మ యెంటి యయ్యును తనవ్రతమును విడువక నిరంతరము భూసురసేవలు సేయుచుండెను. ఆతని యన్నలకుఁ బరోపకారమున కవ కాశము లేకపోవుటయేగాక, వారి కుటుంబ పోషణమునకే మిగుల కష్టపడుచుండిరి. సద్గుణమండితుఁడగు విష్ణుశర్మ యగ్రజులయం దేవిధమయిన యసూయయు లేక, వారిని విశేష తిథులందుఁ దనగృహమునకుఁ దోడ్కొనివచ్చి తన పంక్తిని భోజనము పెట్టుచుండును. విష్ణుశర్మ భార్య మగని మనసులోనిదే మెలంగుచుండును.

ఇట్లుండ నొక్క దినంబునఁ దనయింటి కరుదెంచిన భూసురులను నన్నదాన ఫలంబెట్టిదని విష్ణుశర్మ యడిగెను. అందులకొక్క భూసురుఁడాతని జూచి "అయ్యా! అన్నదాన ఫలమిట్టిదని యెవ్వరును చెప్పఁజాలరు. నీవు కాశికిఁబోయి యందున్న పరమేశ్వరుని సతియగు భవానినడుగుము. ఆమె చెప్పు" నని పలికెను. అంతట నాతఁడు కాశికి బోవనెంచి భార్యంగాంచి "సతీమణీ! నేను వారణాసికిఁ బోయెదనని నీవు సంశయింపకుము. నేను సత్వరముగ మరలివచ్చెదను. నీవు మనయింటికి వచ్చు విప్రులకు నన్నము బెట్టుట యందేమాత్ర మశ్రద్ధ వహింపవలదు. పండుగులయందు మనవారిని దోడ్కొని వచ్చుచుండుము" అని పలికెను.

విష్ణుశర్మ కాశికరిగెను. సాధ్వియగు వానిభార్య భూసురుల కనుదినము నన్నము వెట్టుచుండెను. శ్రీమన్నారాయణుఁడా సుశీల చిత్తగతి నరయఁదలఁచి యామె కొకదినంబున సర్వదరిద్రతఁ గల్పించెను. ఆమె యావంతయు నధైర్యమందక గాదెలో నొక్క దోసెడు బియ్యము మాత్రముండినఁ జూచి, వానినే యెప్పటియట్లు వండెను. అంతట శ్రీహరి యొక వృద్ధ బ్రాహ్మణ వేషమునఁ దద్గృహంబునకు వచ్చి, నిట్టూర్పులు పుచ్చుచుఁ జతికిలఁబడినఁ గాంచి, యామె యతనిం జేరి సేదఁ దీర్చి "తండ్రీ! నీవెవ్వరవు? ఎచ్చటికిఁ బోయెదవు? నీకేమి కావలయు" నని యడిగెను. అందులకా మాయాభూసురుఁడగు శ్రీహరి "సాధ్వీమణీ! నేననాథుఁడ. నానివాస మిదియని

చెప్పఁజాలను. నేటి ప్రయాణమున మిగుల డస్సియుంటిని, పట్టెడశనంబుఁబెట్టి నాప్రాణము నిలుపుము" అని పలికెను. అంత నాగృహిణి, భూసురుని దైవముగాఁ దలంచి, తైలాభ్యంగాదులతోఁ దను శోషణముడిపి, కదళీదళంబున వివిధ పదార్థయుతమగు నన్నమును బెట్టి "మహాత్మా! కడునాకొంటిరి. భుజింపుఁడని పలికెను. ఆసమయంబున నచ్చోటికశనార్థమై యనేకవిప్రులేతెంచిరి. అప్పుడు బ్రాహ్మణరూపశోభితుఁడగు శ్రీహరి విప్రవనితఁగాంచి "మీరన్నదానము సేయుదురని విని నేనిందువచ్చితిని. ఆకలిచే నాకడుపు దహించుకొని పోవుచున్నది. నీవు చేసిన యన్నమల్పమైయున్నది.

ఈ వచ్చిన భూసురులం జూచితివికదా! వీరి కేమి పెట్టెదవు చెప్పు" మనెను. ఆ మాటలకామె "దేవా! నీయనుగ్రహంబున నన్నియు సమకూరును. సంశయింపవలదు. నీవు భుజింపు" మని వినయముతో బదులుచెప్పెను. "ఆకలిఁగొనివచ్చిన బ్రాహ్మణులను విడిచి నేను భుజింతునా! నన్ను వెట్టివానిగఁజేయుచుంటివా" యని శ్రీహరి నుడువ, యావనిత చలింపని మనంబుతో, భగవంతుం డగు శ్రీమన్నారాయణుని దలంచి, యంబుఘటంబు క్రిందనున్న యిసుకను చేటతో చెరిగి యెసరునఁబోసి వండ నయ్యది యన్నమైయుండెను. అప్పుడామె ముదంబంది యా విప్రసమూహంబున కాహారంబుఁ బెట్టెను. బ్రాహ్మణసతి చిత్తశుద్ధికి మెచ్చి విష్ణువు నిజరూపముఁ జూపి "సాధ్వీమణీ! నీయంతరంగం బరయుటకై యిట్లు వచ్చితిని.

నీయందావంతయుఁ గొఱంతఁ గానవైతి. సుగుణగరిష్ఠురాల వగు నీకెవ్వరును నీడుగారు. నీకొకవరంబిచ్చెద వేఁడుము" అని పలికెను. అందుల కాగృహిణి "దేవా! నీ విచ్చువర మెచ్చటికిఁ బోవును. ముందు భుజింపు" మనిన విష్ణుఁ డామెంగాంచి "సతీమణీ! నేను శ్రీహరినిగాని గ్రాసార్థ మాత్ర మరుదెంచిన భూసురుఁడగా"నని పలికెను. ఆ సాధ్వీమణి యా దేవ దేవునకు నమస్కరించి యిట్లు నుడివెను. "మహానుభావా! అభ్యాగతి విష్ణుఁడనియే తలంచి నే నన్నము పెట్టుచుందును. అన్నము పెట్టువారును, గొనియెడువారును, నన్నమును నీ స్వరూపమే కదా! నీవుగాని దేమున్నది.

చ. "అదియునుగాక లేమిఘన ♦ మైగృహకృత్యము సాగకున్న చో
ముదుకతనంబువైచికొని ♦ మూర్ఛమునుంగుచువచ్చిముంగిటం
జదికిలఁబడ్డయప్పుడ ని ♦ జంబుగ నీదగు దివ్యమాయగా
మదిఁగని యున్న దానమతి ♦ మాటలు నేర్తునె నీదుసన్నిధిన్.

"తండ్రీ! కూరలు చల్లారుచున్నవి. కృపఁ బూని యారగింపుము. నీవు భుజింపకున్న నీవిప్రవర్యులు భుజింపరు."

భూసురవనిత వాక్యములకు శ్రీహరి యానందమంది, యశోదావాసమునఁ, గుంతీగృహమున, శబరి యాలయమునఁ బోలె నారగించి, యామెకు వరంబులిచ్చి యంతర్హితుఁ డయ్యెను.

## II

విష్ణుశర్మ వారణాసిం జేరి, గంగయందు స్నానమాచరించి, విశ్వనాథుని యాలయంబును బ్రవేశించి, భవానిం గూర్చి కొన్నిదినంబులు తపంబుసేయ నద్దేవి ప్రత్యక్షమయ్యెను. ఆతఁడామెకు మ్రొక్కి, యన్నదాన విశేషంబును జెప్పుమని ప్రార్థించెను. అందులకామె యాతనికిట్లు పలికెను. "అన్నదానఫల మొక్కయీశ్వరుఁ డెఱుంగును గాని యితరు లెఱుంగరు. అయినను నీకు గట్టిగ విన నిచ్ఛయేని, నొక యుపాయముఁ జెప్పెద. హిమాచల సమీపమున వారణగంగ యను పుణ్యనది యున్నది. దానిపొంత హేమవతం బను పురంబుగలదు. అంగీరుఁడను నృపాలుఁడు దానిఁ బాలించుచుండును. ఆతని భార్య సుమతి. ఆ దంపతులు సంతతి లేని కారణమున మిగులఁ జింతనందుచున్నారు. నీవు వారికడకుం బోయి పుత్త్రోదయమగునని దీవింపుము. పుత్త్రుఁడు పుట్టిన వెంటనే "నన్నుఁ జూడనిం" డని చెప్పి, నీ వాశిశువుం జేరి యన్నదానశోభనసుకృతంబు చొప్పుఁ జెప్పుమని యడుగుము. నీ వాశిశువువలన వినఁగలవు."

పార్వతిమాటలు విని యద్భుతమంది యామె పదకమలములకు నమస్కరించి, యనుజ్ఞఁగొని హేమవతపురాభిముఖుఁడై బయలుదేఱెను. ఆతఁడు త్రోవఁదప్పిఁ యొక ఘోరారణ్యమార్గమునఁ బోవుచుండ నొక్క కిరాతుఁడు జూచి "బ్రాహ్మణోత్తమా! నీవెచ్చటికిఁ బోవుచుంటివి. సూర్యుండస్తమించుచున్నాఁడు. ఇది యంతయు భయంకరారణ్య

మార్గము. వన్యమృగభీతి మిక్కుటముగ నుండును. ఈపూట కిక్కడ నిలిచి తెల్లవారువరకు పోవచ్చును." అని పలికి, యాతనిని దన చేని కడకుఁ దోడ్కొనిపోయెను. బోయ బ్రాహ్మణునకు "దేవా! నీయట్టి మహాత్మునకుఁ దగినట్లు పూజ సేయలేని వాఁడను. నీవెప్పుడు భుజించితివో! పొట్టికందులును, ననుములును నున్నవి. వండుకొనుటకుఁ గ్రొత్తకుండ మాత్రము లేదు. నీ వాఁకలి గొనియుంటివి. ఏమిసేయుదు? ఆనతిమ్ము" అనిన, నబ్భూసురుఁడు కిరాతనాథా! నీసౌజన్యమున నాయాయాసము బాసెను. నాకు గ్రాసేచ్ఛ లేదు. నీవు విచారింపకుమని తన కలశోదకంబున సాయంకరణీయములఁ దీర్చి కూర్చుండెను. అప్పుడు కిరాతుఁడుఁ డాతనికి రెండుదోసిళ్ల చాఱబియ్యంబును దేనెయుఁ దెచ్చి యిచ్చెను. విష్ణుశర్మ వానిని హరి సమర్పితంబుఁ జేసి భుజించి, కిరాతునిచే మంచెపై నెక్కింపఁబడి శయనించెను.

కిరాతుఁడు విల్లునమ్ములఁ దాల్చి నిద్రఁగాంచి, మృగ బాధయొదవకుండ జాగరూకతతో నుండెను. వాని సతియు నచ్చటనే శయనించెను. తెల్లవార వచ్చుచున్నదని తలఁచి, కిరాతుఁడు ఇంచుక కన్నుమోడ్చెను. అంతలో నొక బెబ్బులి వచ్చి వానింజంపెను. చప్పుడువిని కిరాతసతి మేల్కొని యొక తీవ్రశరంబున నావ్యాఘ్రమును వధించెను. బ్రాహ్మణుఁడులికిపడి లేచి, కిరాతునిమృతిఁగాంచి, హాహాయని వాపోవఁ దొడంగఁ, గిరాతాంగన యాతనితో "తండ్రీ! విధికృతమెవ్వరు తప్పింపఁగలరు? నీవు విచారింపవలదు. ఇంక నీవరుగుము. నేను కొంతదూరమరుదెంచి

దారిఁ జూపెద" నని పలికెను. బ్రాహ్మణుఁడు "సాధ్వీ! పుణ్యమునకుఁ బోవఁ బాపమెదురయ్యె నను సామెత నిజం బయ్యెను. మీ వంటి పరోపకారుల నెచ్చటను జూడలేదు. నిన్నువిడిచి యెట్లుపోవుదును? పోవకతప్పదు" అని విచారిం చుచు వచించెను. కిరాతసతి యాతని నోదార్చి, కొంతదూర ముపంపివచ్చి, యగ్నింబడి మృతుండైన భర్తం గలసికొనెను.

విష్ణుశర్మ హేమవత నగరంబున కేగి, యంగీర నృపాలుని జూచి, పార్వతి చెప్పినట్లాశీర్వదించి, యానగరంబున నున్న దేవాలయంబునఁ గొన్ని మాసములుండెను. అంతఁ గొన్నాళ్ళకా రాజచంద్రునకుఁ బుత్రుడు జన్మింపఁగా, విష్ణుశర్మ యా శిశువుంజేరి, యన్నదాన విశేషంబుఁ జెప్పుమనిన, నా శిశువిట్లుపలికెను. "బ్రాహ్మణోత్తమా! ప్రయత్న పూర్వ కముగ భూసురులకు భోజనమిడిన ఫలంబిట్టిదని చెప్ప నాతరమా! ఒక్క దృష్టాంతముఁ జెప్పెద. నాఁడు మీరు ఘోరారణ్యమున కిరాతుఁడనగు నా గృహంబున కరుదేరగా నేను మిమ్ముఁ బూజించి, చేరెడు చాఱబియ్యము నుదేనెయుఁ బెట్టితిని. అందుచే బృందారక రాజ్యతుల్యమగు ధాత్రిని బరిపా లింపనిట్లుజన్మించితి. ఆయల్పదానంబు వలననే నాకిట్టి ఫలంబు సిద్ధించె. నిరంతరాన్నదానశీలుఁడవగు నీ కెట్టి ఫలంబుగల్గునో యది పరమేశ్వరుఁడే యెఱుంగు" నని పలికెను.

విష్ణు శర్మయాశిశువు పలుకులకు మిగుల నద్భుతమంది, యంగీరుని వీడ్కొని, దిన దిన ప్రయాణంబులఁ జేయుచు, నిజనగరంబుఁజేరి, యాలుబిడ్డలతో సుఖముగానుండెను.